వ. ద్వాదశచ్ఛందం బగుజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బండ్రెండేసియక్షరంబు
లై ౪౦౯౬ వృత్తంబులు పుట్టె నందు.

స్రగ్విణి ౧౨-౧౧౭౧

U | U ర U | U ర U | U ర U | U ర.

కామెపల్లీమహా♦గ్రామమధ్యంబునన్
భూమిదేవోత్తము ♦ ల్పూజ సేయంగ నా
స్వామియున్నాఁడనన్ ♦ స్రగ్విణిన్ శైలవి
క్రామయుక్తిం జతు♦ష్కంబగున్ రేఫముల్.

భుజంగప్రయాతము ౧౨-౫౮౬

| U U య | U U య | U U య | U U య.

భజింతున్ సదా కామె♦పల్లీనివాసున్
వ్రజస్త్రీవిటున్ యాద♦వశ్రేష్ఠు నంచున్
భుజంగప్రయాతాఖ్య♦ము ల్నాల్గు యాలన్
గజవ్రాతవిశ్రాంతి♦గాఁ జెప్ప నొప్పున్.

తోటకము ౧౨-౧౭౫౬

| | U స | | U స | | U స | | U స.

తగుఁ దోటకవృత్తము ♦ ధాత్రియతిన్, సగణంబులు నాలుగు ♦ సాగినఁ బ
న్నగపుణ్యనదీసుర♦నాథదిశా, జగతీద్విజపట్టణ♦సంచరణా.

జలధరమాల ౧౨- ౨౪౧

U U U మ U | | భ | | U స U U U మ.

ధీరుల్ మెచ్చం గృతుల న♦తిశ్రీదం బై, మారాకారా జలధర♦మాలావృత్తం
బై రాజిల్లున్ భువిఁ జతు♦రాస్యశ్రాంతుల్, సారం జేరన్ మభసమ♦సంయుక్తంబై.

వంశస్థము ౧౨- ౩౮౨

| U | జ U U | త | U | జ U | U ర.

జతల్ జరేఫంబులు ♦ సామజాతస, న్మితాక్షరశ్రాంతుల ♦ మెప్పు పుట్టఁగాఁ
బతంగరాజధ్వజుఁ ♦ బద్మలోచనున్, నుతింప వంశస్థ మ♦నూన మై చనున్.

ఇంద్రవంశము ౧౨-౧౩౮౧

U U | త U U | త | U | జ U | U ర.

ఇందీవరాక్షుల్ తగ ♦ నింద్రవంశ మా, నందంబునం బాడిరి ♦ నందసూతిపై
డెందంబుల స్తోమము♦ లేవ మీఱఁగాఁ, బొం దై గజశ్రాంతులు♦పూనఁ దాఁ బ్రలన్.

ద్రుతవిలంబితము ౧౨-౧౮౬౪

। । । న ◡ । । భ ◡ । । భ ◡ । ◡ ర.

ద్రుతవిలంబిత•రూప మగుం గుభృ, ద్యతి నభారయు•తంబుగఁ జెప్పినన్
నతజనా శ్రిత•నళ్వసనప్రియా, వితతభూసుర•వీరపురాలయా.

తోదకము (తామరసము) ౧౨-౭౨౦.

। । । న । ◡ । జ । ◡ । జ । ◡◡ య.

సలలితతోదక•సామజవిశ్రాం, తులను నజాయలఁ • దోదకవృత్తం
బలవడుఁ గేతవ•రాసురకాష్ఠో, జ్జ్వలనవకోశర•సాస్థలవాసా.

ప్రియంవద ౧౨-౧౮౦౦

। । । న ◡ । । భ । ◡ । జ ◡ । ◡ ర.

విభు శమీరపృథి•వీజరత్నభా, గభవనాలయుని గా మెపల్లికా
ప్రభు నభజ్రలను • బ్రస్తుతింప నౌ, నిభవిరామమున • నీ ప్రియంవదల్.

ప్రమితాక్షరము ౧౨-౧౭౭౨

। । ◡ స । ◡ । జ ॥ ◡ స । । ◡ స.

ప్రమితాక్షరం • బమరుఁ బద్మజవి, శ్రమ మొప్పమీఱ • సజసాయుతమై
యమునానదీతటవి•హార పృథా, ప్రమదాకుమారసఖ • భద్రయశా.[1]

జలోద్ధతగతి ౧౨-౧౭౭౬.

। ◡ । జ । । ◡ స । ◡ । జ ॥ ◡ స.

జలోద్ధతగతిం ది•శాగజయతిన్, మెలంగు నినుమూఱు • మెచ్చఁగ జసల్
ఫలానుభవ కామె•పల్లినిలయా, ఖలాంబుదసమీర • కామజనకా.

విశ్వదేవి ౧౨-౫౭౭

◡◡◡ మ ◡◡◡ మ । ◡◡ య । ◡◡ య.

శ్రీవత్సాంకా పద్మాధ•రిత్రీకళత్రా, దేవేంద్రస్తోత్రా విశ్వ•దేవీసమాఖ్యం జెప్పన్.
బై విప్పొందు న్మాయాగ•ణావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చోద్య•మైయుండఁ

చంద్రవర్త్మ ౧౨-౧౯౬౯

◡ । ◡ ర । । । న ◡ ॥ భ ॥ ◡ స.

ఇంద్రవంద్య జగ•దీశ ఘనయశ, స్సాంద్ర కామెపలి•సద్మ యదువరా
చంద్రవర్త్మ యగు • శైలవిరతి ని, స్తంద్ర మై రనభ•సంబు లమరినన్.

---

1 (ప. పె) లో ౧౭౭౨ అనియే యున్నది. (పూ. ము) లో ౧౭౮౦ యున్నది. ఇదిచూచి యిటీవలివారు వ్రాతప్రతులలో సరి గానున్న సంఖ్యను తప్పుగాదిద్దుకొన్నారు.

ప్రహేయము ౧౨-౫౭౬

।।।న।।।న UUU మ।UU య.

శరవిరమణముల్ ♦ గా నామయుంబుల్, బరఁగ నిలుపఁ జా♦పట్టుం బ్రహేయం
బురగశయన భో♦జోర్వీశపుత్రీ, వరపరమకృపా♦వారాశి కృష్ణా.

ప్రముదితవదన ౧౨-౧౨౧౬

।।।న।।।న U।U ర U।U ర.

మమత నిభవిరా♦మముల్ గూడఁగా, జమిలినరములన్ ♦ సదా చెన్నగున్
బ్రముదితవదనల్ ♦ రమానాయకా, సుమశరజనకా ♦ సుపర్వస్తుతా.

కుసుమవిచిత్రము ౧౨-౯౭౬

।।।న।UU య।।।న।UU య.

కుతలములోనం ♦ గుసుమవిచిత్రం, బతిశుభదం బై ♦ యగయతు లన్నం
దతనయ యొప్పున్ ♦ నయ లనుమా నై, సతతము విద్వ♦జ్జనులు నుతింపన్.

మణిమాల ౧౨-౭౫౧

UU।త।UU య UU।త।UU య.

కామేపలినామ♦గ్రామస్థలవాసా, స్వామీ తయకార♦ద్వంద్వంబు పొసంగున్
జేమాఱుమహీభృ♦ద్విక్రాంతులతోడన్, భూమండలిఁగూర్పం♦బొల్చున్మణిమాలల్.

మేఘవిలసితము ౧౨-౨౦౮౧

UUU మ।।।న।।।న।।U స.

కాళిందీముఖ♦కమలమధుకరా, నాళీకాసన♦నతరసవిరతు
ల్గాఁగ్రిల న్మేఘవి♦లసితము దనరు, న్వాలాయంబు మ♦ననసగణములన్.

వ. త్రయోదశచ్ఛందం బగునతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదుమూఁడేసియక్ష
రంబు లై యెనిమిదివేలనూటతొంబదిరెండువృత్తములు పుట్టె నందు:—

మత్తమయూరము ౧౩-౧౬౩౩

UUU మ UU।త।UU య।।U స U గ.

శ్రీగోపాలా తంగెడ♦సీమావనిగేహా
వాగీశాదిస్వర్గని♦వాసస్తుతిపాత్రా
యోగిధ్యేయా మత్తమ♦యూరంబున కొప్పున్
నాగక్రాంతు ల్మత్యగ♦ణంబు ల్సగమొందన్.

ప్రహర్షిణి ౧౩-౧౮౦౧

◡◡◡మ।।న।◡జ◡।◡ర◡గ.

ధీరుల్ సింధురవిర♦తిఁ మనజ్రగంబుల్, సారంబాదములను♦సంఘటించుచుండన్
గ్రూరారిప్రహరున♦కుం బ్రహర్షణుల్పెం, పారం జెప్పఁ దురుము♦హాముదంబుతోడన్.

ప్రభాతము ౧౩-౧౩౯౨

।।న।◡జ।◡జ◡।◡ర◡గ.

మొనసి నజారగ♦ముల్ ప్రభాతవృత్తం, బునకు మదేభస♦మూహ విశ్రమంబుల్
దనరఁగ నిల్పుఁ బృ♦దాకురాజతల్పా, కనకమయాంశుక ♦ కామెపల్లివాసా.

జలదము ౧౩-౩౭౮౩

◡।భ◡।◡ర।।న◡।భ◡గ.

బంగరుచుంగుపచ్చడము ♦ పైఁ గలయా, తంగెడదేశవాసు జల♦దంబులచే
తం గడు సన్నుతింతు నవ♦తారయతిన్, బొంగుచు సారభర్నభగ♦ముల్ గదియన్.

మంజుభాషిణి ౧౩-౨౮౯౬

।।◡స।◡జ।।◡స।◡జ◡గ.

ఉరగాపగాదిహరి♦దుర్వ్రాలయా, కరుణాసముద్ర మార♦గర్వభంజనా
యిర వొందుచుండు సజ♦లిబ్బడింపఁ బల్మరు గా ప్తిధాతృయతి♦మంజుభాషిణుల్.

రుచిరము ౧౩-౨౫౦౬

।◡జ◡।భ।।◡స।◡జ◡గ.

గదాధరున్ జభసజ♦గంబులన్ గవుల్, సదా పితామహయతి♦సాగుచుండఁ గా
ముదంబుతోడ రుచిర♦ము ప్రచింతు రి, ట్లుదారభక్తిఁ గృతుల ♦ సర్వారాధ్యలిన్.

క్షమ (క్షప) ౧౩-౨౩౬౮

।।న।।న◡◡।త◡◡।త◡గ.

క్రమమున నిభవి♦క్రాంతి నాతాగయు, క్షమాగ సుకవిప♦ద్యంబు లూహించినన్
క్షమ ననఁ బరఁగుం ♦ గంజపత్రేక్షణా, సుమశరజనకా ♦ సూరవంశోత్తమా.

చంచరీకావళి ౧౩-౧౧౭౩

◡◡◡మ◡◡◡మ◡।◡ర◡।◡ర◡గ.

కంబుగ్రీవాసత్యా♦కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ♦ల్పొర్చిభూభృద్యతుల్గాం
చుం బాదంబైధాత్రిం♦జంచరీకావళీనా, మం బొందుం గావ్యశ్రీ♦మానినీభూషణంబై.

మత్తహంసిని ౧౩-౨౯౬౦

I∪Iజ∪∪Iత II∪సI∪Iజ∪గ.

మనోహరాకార • మధుదైత్యసంహారా, వినాయకారాధ • విబుధేంద్రవందితా
జనార్దనా జత్స • జగురుల్ సుభృద్యతిన్, దనర్చుంబద్యంబు • దగు మత్తహంసినిన్.

సుమంగలి ౧౩-౧౭౭౬

II∪ సI∪I జ II∪ స II∪ స∪ గ.

సారిదిన్ ధరిత్రిని • సుమంగలివృత్తం, బరయంగ సామజ • యతిన్ సజసాగల్
తిర మొంద నొప్పు విధిపూజితపాదాం, బురుహద్వయా ఖర • మురాసురవైరీ.

వ. చతుర్దశచ్ఛందం బగుశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలుగేసియక్షరంబులై ౧౬౩౮౪ వృత్తములు పుట్టె నందు:—

వనమయూరము ౧౪-౩౮౨౩

∪ II భ I∪I జ II∪ స III న ∪∪ గగము.

శ్రీకర ధరాధర • జిష్ణునుత పుణ్యా, శ్లోక భజసన్నగగ • లున్ ద్రుహిణసంఖ్యన్
సోఁకువిరమంబుగను • చున్వనమయూరా, ఖ్యాకమనువృత్తమిల • నత్తమిలుచుండున్.

వసంతతిలక (సింహోన్నతము, ఔద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి)
౧౪-౨౯౩౩

∪∪ I త ∪ II భ I∪ I జ I∪Iజ∪∪ గగము.

శ్రీమేదినీరమణ • సింధుతరంగరంగా, ద్రామాహితల్ప విన • తానుతవాహ రాధా
కామా వసంతతిల • కన్ దభజాగగంబుల్, సామప్రభూతయతి • సాగిధరం జెలంగన్.

భూనుతము ౧౪-౩౭౧౭

∪/ర III న ∪ II భ ∪ II భ ∪∪ గగము.

ముష్టరించి రనభాగగ • ముల్ దశవిశ్రా, మంబుభూతలమునందున • మానితమయ్యెన్
జాంబవత్యధిప కేశవ • సారస నేత్రా, కంబునందకగదాధర • ఖండితసాళ్వా.

సుందరి ౧౪-౫౮౧౭

∪ II భ ∪ II భ ∪ I ∪ ర II ∪సI∪వగణము.

సూరిజనప్రకరంబు • సుందరి నెన్నఁగా
భారసవంబులు రత్న • భాసితవిశ్రమా
ధారముగాఁ దనరారుఁ • దార్క్ష్యతురంగమా
శౌరి ముకుందమునీంద్ర • సన్నుతకేశవా,

ప్రహరణకలిత ౧౪-౮౧౨౮

| | | న | | | న U | | భ | | | న | U వగణము.

పవిగొను నెపుడుం బ్రహరణకలితన్, ననభనవలు మం దగజవిరమముల్
ఘనవిభఘనవి గ్రహ బకమురమ, ర్దన మధునరక ప్రహరణకలితా.

నవనందిని ౧౪-౩౯౪౮

| |U స |U| జ |U స ||| న U U గగము.

నవనందినిన్ సజగణాన్నగగ లారౌఁగ, నవవిశ్రమంబును దనర్చి చెలువొప్పన్
నవనీతచోరకు జనార్దనునుపేంద్రున్, భవదూరు నెంతురు సభాసదులుభక్తిన్.

అపరాజితము ౧౪-౫౮౨౪

| | | న || |న U |U ర || U స| U వగణము.

ననరసలగ లొందిన న్నవవిశ్రమం, బును గలిగి కవీంద్ర భూషిత మై జనా
ర్దన నిగమగోచరా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్యమై వినువారికిన్.

అసంబాధ ౧౪-౨౦౧౭

U U U మ U U | త | | | న | | U స U U గగము.

వాలాయంబున్ సత్కవిజనములు వాక్రువ్వన్
వాలారున్ గోవింద వరద ఘృణివాత్సల్యా
కాళిందీప్రాణేశ మతనసగ గప్రాప్తిన్
జాలాభాస్వద్విశ్రమమునను నసంబాధల్.

కమలవిలసితము ౧౪-౪౦౯౬

| | | న| | | న | || న| | |న U U గగము.

క్రమమున నననన గగములు గూడన్, గమలవిలసితము కమలజవిశ్రా
మము జగతిని నగు మహితచరిత్రా, కమలదళనయన కడుఁ బొగడొందున్.

వ. పంచదశచ్ఛందం బగునతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదిహేనేసి యక్షరంబులై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె నందు.

మాలిని ౧౫-౪౬౭౨

|| | న || |న U U U మ| U U య| U U య.

కనకకశిపుహర్తన్ గానలోలున్ శుభాంగున్
దనుజహరణదక్షున్ ధర్మమార్గానుసారిన్
మననిజగురు నెంతున్ మాలినీవృత్త మందున్
ననమయయగణంబుల్ నందివిశ్రాంతి గూడన్.

సుకేసరము (భద్రకము) ౧౫-౧౧౧౮౪

| | |న|∪|జ|∪||భ|∪|జ|∪|∪ర.

సురుచిరధర్మమూల మయి•సొంపు మీఱు నా, గిరిధర నాభిపంకజసు•కేసరంబునై
ఖరి నజభ ద్రము లిదియుఁ•గల్పనంబునన్, గిరిశ విరామసంగతి సు•కేసరంబునన్.

మనోజ్ఞ ౧౫-౧౧౬౩౭

| | | న| ∪ |జ|∪| జ∪| |భ∪|∪ర.

అజమృడవాసవసంత•తార్చితపాదపం
కజయుగళున్ హరి నిర్వి•కారు మనోజ్ఞ నా
బుజ వగువృత్తమునందుఁ • బ్రీతి నుతింపఁగా
నజజభరంబులు వొల్చు • నచ్చిన దిగ్యతిన్.

మణిభూషణము ౧౫-౧౧౭౦౭

∪ | ∪ ర | | | న ∪ | | భ ∪ | | భ ∪ | ∪ ర.

వింత యైనమణిభూషణ•వృత్తమందు న
త్యంతమోదమున నెన్నను • నద్దశవిశ్రమా
క్రాంత మయ్యు రనభారలఁ • గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు • నార్యసమూహముల్.

సుగంధి (*శాలినీ, చామర, ప్రశాంతి) ౧౫-౧౧౯౨౩

∪|∪ర|∪|జ∪|∪ర|∪|జ∪|∪ర.

రంబు జంబు రంబు జంబు • రంబు చెన్ను మీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు • తోర మై సుగంధికిన్
గ్రమ్మఁగా నుతింప నొప్పుఁ • గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవు • డక్షరాఖ్యుఁ డెప్పుడున్.

ఇల ౧౫-౧౬౩౬౪

||∪స|∪|జ| | |న| | |న|| ∪స.

గజవిశ్రమంబునఁ • గనలు నిల యనఁగా, సజనాస లుండిన•సకలకవికృత మై
భుజగాశనధ్వజు•భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ•వనజహితుఁ బొగడన్.

* ౧౧వ ఛందములో మఱియొక శాలినీవృత్తము గలదు. (2౩0 పుట)

### చంద్రరేఖ ౧౫-౪౬౨౫

UUUమ U|Uర UUUమ |UUయ |UUయ.

మత్తేభక్రాంతిచే ర•మ్యం బౌ మహిం జంద్రరేఖా
వృత్తం బౌ మ్రమ్యయంబుల్ • వేడ్కన్ హృషీకేశుఁ బార్థ
క్షత్త న్నారాయణు న్వి•శ్వామిత్రయాగారిదైత్య
చ్ఛేత్త న్దాశార్హు లక్ష్మీ•చిత్తాబ్జవాసు న్నుతింపన్.

### నలిని ౧౫-౧౪౦౪౪

||U స ||Uస ||Uస ||Uస ||Uస.

సససాసలచే దశవి•శ్రమయుక్తతచేఁ, బొసఁగ న్నలినిన్ మణికం•బు సుదర్శనహ
స్తసరోరుహువామనుఁ గే•శవు శౌరి నజున్, వసుదేవనృపాలతనూ•భవుఁ బాడుదురా.

### అలసగతి ౧౫-౭౬౪౮

|| న| |Uస || నU| |భ| UUయ.

అలసగతి నాఁ జను స•భాంతరమునందు, న్విలసదవతారయతి • నిండి నసనభ్యల్
గలయ శకటాసురవి•ఘాతను విశిష్టున్, బలుమఱుఁ గవీశ్వరులు•ప్రార్థనలు సేయన్.

### మణిగణనికరము ౧౫-౧౬౩౮౪

|| న| | న| | న| | న| |Uస.

మణిగణనికరమ•మను లఘుగురు వై, మణివిరమణ మయి • మధుదనుజహరున్
ఫణిపతిశయనునిఁ • బ్రమథితనరకు, న్ఘృణిమదయుతనిభు•ని బొగడఁ దనరున్.

వ. షోడశచ్ఛందం బగు అష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాఱేసియక్షరంబు లై ౬౫౫౩౬ వృత్తములు పుట్టె నందు:—

### ప్రియకాంత ౧౬-౧౩౨౬౪

|| న|UUయ || న|UUయ |Uస Uగ.

అమరులు భృత్యు ల్తనయు వి•యద్గంగ ధరిత్రి
కమలలు [1]పెండ్లాములు రవి • కంజారులు గన్నుల్
శమితతృణావర్తున కని • చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణ•మై న్యన్యసగం బై.

### పంచచామరము ౧౬-౨౧౮౪౬

|Uజ U|Uర |Uజ U|Uర |Uజ Uగ.

జరజ్రిజంబులున్ గముం బొ•సంగి తొమ్మిదింటిపై
విరామ మొంది సత్కవు ల్స•విస్తరంబు సేయఁగా

---

1 పెంళ్లాములు.

బరాత్పరుండు మాధవుండు ♦ పంచచామరంబునన్
బ్రరూఢగుంభనంబులంగఁ ♦ బాడ నొప్పు ధాత్రిలోన్.

పద్మకము ౧౬-౨౩౮౧౬

|||న◡||భ|◡|జ|◡|జ|◡|జ◡గ.

నభజజాగగణయుక్తిఁ బ♦వాకవిరామక
ప్రభవ మై కృతుల నొప్పును ♦ బద్మక మంద మై
ప్రభుఁడు వక్రమును ద్రుంచి సు♦రక్షితుఁ జేయ సా
మభవపద్మకముచాడ్పున ♦ మానిత మై ధరన్.

చంద్రశ్రీ ౧౬-౧౦౧౭౭

|◡◡య◡◡◡మ|||న||◡స◡|◡ర◡గ.

క్షమం జంద్రశ్రీతోయమనసర♦గ ల్పానువిశ్రా
మముల్ సంబంధించు స్మరహరి ర♦మాచిత్తచోరా
శమీయామ్యాగారా శమనసహ♦జానాథకృష్ణా
పరిమత్తశ్రీవ్యాదక్షణదళన ♦ రాధాభుజంగా.

మేదిని (వాణి) ౧౬-౧౧౧౫౮

|||న|◡|జ◡||భ|◡|జ◡|◡ర◡గ.

మృడయతి నజభజర్గములు ♦ మేదినీసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ దనరు ♦ దంష్ట్రి పద్మనాభా
జడనిధితల్ప నందసుత ♦ సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి ♦ గావు మయ్య దేవా.

ఫలసదనము ౧౬-౧౬౩౫౮

|||న|||న|||న|||న||◡స◡గ.

ననననసగములు ద♦నరఁగ దశవిశ్రాం
తిని ఫలసదనము ల♦తిశయ మగుచొప్పన్
మునిజనహృదయములఁ ♦ బొలుచువానిన్(?)
నొనబుగముద మొదవఁ ♦ గొలిచెద మటంచున్.

అశ్వగతి ౧౬-౨౫౦౫౭

◡||భ◡||భ◡||భ◡||భ◡||భ◡గ.

అందము లైనభకారము ♦ లైదును గాంతము నై
పొంది పదింట విరామముఁ ♦ బూనినయశ్వగతిం

గంధసమానమహోన్నత • గాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయఁగ • వేడుక యయ్యెఁ జుమీ.

మదనదర్పణము ౧౬ - ౨౧౮౫౫

U II భ II U స I U I జ U I U ర I U I జ U గ.

చారుమదనదర్పణంబు భ • స్జరజగముల్ దగుఁ
మారవిమతవిక్రమంబున • న్మహిం జెలంగు నా
భీరుల యమునాతటంబునం • బ్రియంబుఁ జేసి యా
ధీరవరుఁడు గూడె నంచు భ • క్తి సన్నుతింపఁగా.

గజవిలసితము ౧౬-౩౭౨౭౨

U I II భ U I U ర III న III న III న U గ.

బాలసరోజనాభ • వరద తనుమిళితజం, బాల దిగంబరా స • మస్తృణకబళకర లం
బాలక మంగళాన • హా గజవిలసితమున, న్గాలిలం భ రేఫనాన • నగము లిభవిరమ మై.

వ. సప్తదశచ్ఛందం బగుఅత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియే డేసియక్షరంబు
లై ౧౩౧౦౭౨ వృత్తంబులు వుట్టె నందు:—

శిఖరిణి ౧౭-౫౯౩౩౦

I UU య UUU మ III న II U స U II భ I U గణము.

భజింతు న్నిత్యంబు న్మునిజనసదా • ప్రార్థనపరుఁ
గజేంద్రార్తిధ్వంసిం గృతకలలనా • గ్రావు నజరుఁ
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్ • విశ్వవిరతి
ప్రజాతాహ్లాదం బై శిఖరిణి యనా • భాసుర మగున్.

పృథ్వి ౧౭-౩౮౭౫౦

I U I జ I I U స I U I జ I I U స I UU య I U వగణము.

జసల్ జసయవంబు లుష్ణకర • సంఖ్యవిశ్రాంతులుఁ
బొసంగి కవిపుంగవుల్ పలుక • భూమిలోఁ బృథ్వి నా
నసంశయ మగుం గళిందతన • యామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృత • పరశ్వధా మాధవా.

హరిణి ౧౭-౮౬౧౬౨

I I I న I I U స UUU మ U I U ర I I U స I U వగణము.

హరిణి యనువృత్తం బొప్పు న్భాస్క • రార్తవిరామ మై
సరి నసమరేఫస్వం బై షోడ • శప్రమదాసహా

క్రమముఁ దృణావర్తశ్వ్యాద•సంహారు మస్తకో
పరిరుచిరపింఛాచూడుం బీత•వస్త్రు నుతింపఁగా.

నర్కుటము (కోకిలకాకము) ౧౭-౫౬౨౮౦

|||న U|జ U||భ U|జ U|జ U వగణము.

కొలిచెద నాదిదేవుపద•కోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిబాముసఁ గు•దుర్వుడుపాపములం
దలఁచెద నామధేయ మతి•తత్పరత న్జభజా
వలఁ దగునర్కుటంబునకు • భర్గవిరామములన్.

మందాక్రాంత ౧౭-౧౮౯౨౮

UUUమ U||భ|||న UU|త UU|త UU గగము.

మందాక్రాంత న్గిరిశవిరతు • ల్మభ్నతాగాగణంబుల్
పొందె న్సాందీపునివలన సం•పూర్ణవిద్యాచయంబుల్
క్రుందించె న్ద్వారుణరణమునం • బౌండ్రసాళ్వాదులం జే
యందెం జేరం డడుకులకు నం•దాత్మజాం డంచుఁ జెప్పన్.

పాలాశదలము (త్వరితగతి) ౧౭-౩౨౭౬౮

|||న|||న|||న|||న|||వ UU గగము.

అదనదనున హరినుతు • లమర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి•జనులు వచియింపన్
బదునొకఁ డగునెడ యతి • పదిలముసఁ జేరన్
గదియు నగణములయిదు • గగము తుద నొందన్.

వంశపత్రపతితము ౧౭-౬౪౯౮౩

U||భ U|U ర|||న U||భ|||న| U వగ.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ • భరనభనలగల్
సాగి పినాకివిక్రమమునన్ • సభలనుఁ గుదురై
రాగిలువంశపత్రపతిత • ప్రణమున నరకు
ప్రాగతనంబునం దునిమె నం•దతనయుఁ డనినన్.

చంపకకేసరి ౧౭-౪౬౮౨౮

॥Uస।U।జ॥Uస॥Uస॥Uస।Uవగ.

సనకాదియోగినుతు • జాంబవతీప్రియు నిర్విక
ల్పు నమేయు నక్షరు వి•భు న్యమళార్జునభంజనున్
వనమాలిఁ గృష్ణు ముర•భంజను నెంతురు వారిజా
సనవిక్రమంబు సజ•సాస్వలు చంపకకేసరిన్.

వ. అష్టాదశచ్ఛందం బగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిదియక్షరంబు
లై ౨౬౨౧౪౪ వృత్తములు పుట్టె నందు:—

మత్తకోకిల ౧౮-౯౩౦౧౯

U।Uర॥Uస।Uజ।Uజ।॥భU।Uర.

అత్తమిల్లు మహేశవిక్రమ • మార్యసమ్మతి నొప్పఁగా
సత్తులా రసజాభరేఫలు • చాకళింపుచు నొందఁగా
మత్తకోకిలవృత్తపద్ధతి • మక్కువం బొనరింపఁగా
హత్తి పూజ యొనర్ప వచ్చు జ•నార్దనాహ్వయు నెప్పుడున్.

కుసుమితలతావేల్లిత ౧౮-౩౭౮౫౭

UUUమUUIత॥।న।UUయ।UUయ।UUయ.

వేమా రెన్నంగాఁ గుసుమితలతా•వేల్లిత మ్మత్నయాయల్
శ్రీమార్తాండక్రాంతియుఁ గుదిరినం • జెన్ను మీఱు న్ధరిత్రిన్
గామేపల్లీశుం గనకవసనుం • గంజనేత్రున్ శుభాంగున్
గోమద్భాలుం గాలయవనహరుం • గుంజరేంద్రార్తినాశున్.

నిశ ౧౮-౭౪౯౪౪

॥।న॥।నU।Uర U।Uర U।Uర U।Uర.

ప్రబలు నిశను నార•రారంబుల నరిత్నవిశ్రాంతియున్
గబళితదవపావ•కాపూతవాజీవితాహారి కృ
ష్ణ బలసహజ పారి•జాతాపహారా యదుశ్రేష్ఠ దే
వబలదమనవంద్య • బంహిష్ఠ వార్ణేయ శైనేయకా.

హారనర్తనము ౧౮-౯౦౯౭౧

U।Uర॥Uస।U।జ।UUయU॥భU।Uర.

దావపావకఖాది మా•ధవ దాశార్హా•దనుజాంతకా
దేవకీప్రియనందనా•దివిషద్వంద్యా•ధుర్యసన్నుతా

భావగోచర విశ్వరూ • ప దయా స్వాకృ్రి • వ్వ నవర్తసం
ఖ్యావిరామము రేఫస • జ్యభరేఫంబుల్ • వారన ర్తనా.

త్సాహారము ౧౮-౩౦౮౪౧

UUU మ | | | న | UU య UU | త | | | న UUU ము.

బావా బాహిని దమలో • భ్రాతల్ దొడ్డ • పగలఁ బోరాడం
గా వాంఛీరుఁ డగుబుభు • త్సానూనుఁడా జ • గతిని గూలంగా
నావా యేనినవరపా • లా రత్నే షు • యతులు పొందంగా
త్సావారంబు మనయత • న్మంబుల్ చెంది • [1]మనును నందం బై.

వ. ఏకోనవింశతిచ్ఛందం బగునతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బందొమ్మిదేసి య
క్షరంబు లై ౫౨౪౨౮౮ వృత్తములు పుట్టె నందు:—

శార్దూలవిక్రీడిత ౧౯-౧౪౯౩౩౭

UUU మ || U స | U | జ || U స UU | త UU | త U గ ము.

నీరేజాంచితలోచనాయ హరయే • నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే • హార్యక్షవక్త్రాయ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీ • హా విశ్వవిక్రాంతి వి
స్తారింప న్మసజ స్తతంబులు గము • న్శార్దూలవిక్రీడితన్.

తరళ ౧౯-౭౫౭౧౪

| | | న U || భ U | U ర || U స | U | జ | U | జ U గ ము.

జలజలోచనుఁ గైటభాంతకు • శంఖచక్రగదాధరున్
గలశజాదిమునీంద్రసేవితుఁ • గాళియాంతకు నచ్యుతున్
బలుకుచోఁ దరళంబు లందుల • భానువిశ్రమపద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమ • కట్టి చెప్పుదు రుత్తముల్.

మేఘవిస్ఫూర్జితము ౧౯-౧౮౬౫౮౭

| UU య UUU మ | | | న | | U స U | U ర U | U ర U గ.

క్షమాలక్ష్మీనాథున్ విదురవరదున్ • జాహ్నవీజాతపాదున్
సమామ్నాయస్తవ్యున్ గరుడతురగున్ • సామజప్రాణదాతన్
మిముం దాఁ జేరం గొన్న న్నభలఁ దనరు • న్మేఘవిస్ఫూర్జితంబుల్
విమర్శం గూర్పన్ యమ్నసరరగము • ల్విశ్వవిశ్రాంతిచేతన్.

---

1 శనలు.

చంద్రకళ ౧౯-౧౫౬౭౭౨

◡।◡ర॥◡స॥◡స◡◡।త।◡।జ।◡।జ◡గ.

తానకంబుగఁ జంద్రకళావృ • త్తంబు కవు ల్విరచించిరన్
మీనులార మనోజ్ఞపదంబుల్ • పేర్చి కపర్ది విరామ మై
కాన వచ్చి రస స్తజజంబుల్ • గంబు దనర్చి కళిందజా
మానినీరమణ స్తవగాథా • మానితరత్నములం దగున్.

భూతిలకము ౧౯-౧౫౬౦౩౯

◡।।భ◡॥భ◡।◡ర॥◡స।◡।జ।◡।జ◡గము.

భారసజాగగణంబులుం బఱ • వంగ భానువిరామవి
స్ఫారత భూతిలకంబు పాండవ • పక్ష దైవతవృక్ష మిం
పార ధరిత్రికిఁ దెచ్చినట్టిమ • హాత్మ యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన • శ్రావ్య మౌ వినువారికిన్.

కవికంఠభూషణము. ౧౯-౧౨౨౯౦౦

॥◡స।◡।జ॥◡స॥◡స॥◡స।◡।జ◡గ.

నవరత్నవిశ్రమము • నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము • గా రచియింతురు మాటిమాటికి
శ్రవణీల్లుకబ్బమున • నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్కథాసుధలఁ • దత్పరు లై[1]న మహాత్ము లట్లుగాన్.

వ. వింశతిచ్ఛందం బగుకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేనియక్షరంబు లై ౧౦౪౮౫౭౬ వృత్తములు పుట్టె నందు:—

మత్తేభవిక్రీడిత ౨౦-౨౯౫౬౭౬

॥◡స◡॥భ◡।◡ర। ॥న◡◡◡మ।◡◡య।◡వగణము.

మనువిశ్రాంతిని సభ్రివమ్యవములన్ • మత్తేభవిక్రీడితా
హ్వాను వృత్తంబు చెలంగె మానవతులా • రా వీఁడె యే తెంచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చునాఁడు యమునా • తీరంబునం బొంది వే
డ్కను మాచీరలు దోఁచుకొన్న వెడదొం • గం జూచినారా యనన్.

---

1 తవరారునట్లుగాన్.

ఉత్పలమాల ౨౦-౩౫౫౭౨౮౯

U।భU।Uర।।నU।భU।భUUర।Uవగణము.

పేరిన నేయిదుగ్ధములు • పెర్గను మీఁగడయున్న దా వ్రజా
గారము సొచ్చి త్రాగి వెస • గంతులు వైచుమురారి నెంచఁ గా
ధారుణి రూఢి కెక్కు నవ • తారవిరామముచే లసద్భరల్
భారలగంబులుం గలయఁ • బల్కిన నుత్పలమాల చెన్నగున్.

అంబురుహాము ౨౦-౩౨౨౧౫౧

U।భU।భU।భU।భU।Uర।।Uస।Uవగము.

చారుతమాలదళానితవర్ణునిఁ • జక్రహస్తుసనాతను
న్దారితకంసముఖక్షితిపాలకు • నందనందను నవ్యయున్
శూరకులోద్భవుఁ గైటభభేదిని • జోలి చేసి నుతింప భా
భారసవంబులు విశ్వవిరామముఁ • బల్కు నంబురుహాం బగున్.

ఖచరప్లుతము ౨౦-౩౨౩౧౨౬

।।।నU।భU।భUUUమ।।Uస।।Uస।Uవగ.

యమునలోఁ జొర నోడిననానా • ప్రాకృతజంతువులం బ్రమో
దమునఁ బ్రోచుటకై కలఁచంగా • దర్పమునం జనుదెంచి ఘో
రముగఁ జుట్టిన కాళియు సంహా • రం బొనరించినకృష్ణ య
*ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ • రాజిలనౌ ఖచరప్లుతన్.

ప్రభాకలిత ౨౦-౩౨౨౦౨౯

।।।న।Uజ।Uజ।భU।Uర।।Uస।Uవగము.

వలి పదమూఁడవయక్కరంబుగ • వాని కెక్కు నజాభరే
ఫలు సలగంబు లమర్చి సొం పాద • వం బ్రభాకలితాఖ్యమై
చెలు వగువృత్తమునందు సత్కవి • శేఖరు ల్వినుతింతు రా
జలనిధిమీఁదను బవ్వళించిన • జాంబవత్యధిపాలునిన్.

వ. ఏకవింశతిచ్ఛందంబగు ప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క యక్షరంబులై ౨౦౯౭౧౫౨ వృత్తంబులు వుట్టె నందు:—

---

* ర్యమవిరామముతోడ నభామ్స • స్వల్పైలయున్ (పూ. ము.) ఇందు యతి తప్పినది; ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ • రాజిలనౌ (ప. ఓ. పె.) ఇందు గణము తప్పినది.

చంపకమాల ౨౧-౭౧౧౬౦౦

|||న|U|జU||భ|U|జ|U|జ|U|జU|Uర.

చపలమనీషతోఁడ నొక • సంయమి వే మొఱ వెట్టుచుండఁగాఁ
గృపను దదీయపుత్త్రి బ్రతి•కించినమేటివిభుండ వంచు నిన్
సపరిగణంబుతో నజభ•జాజలు రేఫయుఁ గూర్చి సత్కవుల్
త్రిపురవిభేదనాఖ్యవిర•తిం దగఁ జంపకమాలఁ గొల్తు రా.

వనమంజరి ౨౧-౭౪౪౩౦౪

|||న|U|జ|U|జ|U|జ|U|జU||భU|Uర.

మనువిరతు ల్నజజాజభర ల్వన•మంజరిం గవిశేఖరుల్
దనరఁగ నాజయుఁడు న్విజయుం డను • ద్వారపాలకు లిర్వురు
న్సనకునిశాపము దాఁకి నిశాటు ల•నంగఁ బుట్టి సుపర్వులన్
జెనకినవాంద్రను జంపినకోలన్ృ•సింహుని న్వినుతింతు రా.

* స్రగ్ధర ౨౧-౩౦౨౯౯౩

UUUమU|Uర U||భ|||న|UUయ|UUయ|UUయ.

మానొందున్ స్రగ్ధరాఖ్యన్ • మరభనయయయల్ • మత్తనాగాష్టవిశ్రా
మానూనప్రాప్తిలెనన్ • హరిముఖదివిజుల్ • యాతుధానవ్రజంబుల్
సానందాసక్తితోఁ దో•యధికడ నమృతం • బారగింపంగ నచ్చో
మానిన్యాకారతన్ స•మ్మదమువొదలఁ బ•ద్మాధవానందపుత్త్రా!

లాటీవిటము ౨౧-౩౯౪౯౭౨

||Uస||Uస||Uస||UసUUUమUU|త|UUయ.

సగణంబులు నాల్గిట మత్యలవి•శ్రాంతి న్లాటీవిటవృత్తం
బగు నంచుఁ గవీంద్రులు గొల్తురు స•మ్యక్ప్రీతి న్యాచించి యథేచ్ఛం
దగునేర్పున మూఁడు పదంబులుగాఁ • దైత్రిలోక్యంబు [2]గ్గొల్చి సురారుల్
వొగలం బలిదానవుఁ ద్రొక్కినయా•పొట్టిం దిట్ట న్వామనుఁ గృష్ణున్.

మణిమాల ౨౧-౯౬౫౩౫౬

||Uస|U|జ||Uస|U|జ||Uస|U|జ||Uస.

అజహాత్ప్రయోదధిధృతంబు • లమ్ముచు మురారిఁ బాడి రలమిన్
వజ్రఁగాఁ దదీయచరణా•త్తి•నవ్యహృదయారవింద లగుచు

---

* ఇది (పూ. ము)ల లో లేదు. (ప) లో ఉన్నది. 2 (పూ ము.)లలో-గొల్వఁ గరూరుల్.

న్వ్రజసుందరీజనము లొక్క-నాఁడు మణిమాలయందుఁ బొసఁగ
న్భజము ల్త్రివారము సముం బి-నాకివిరమంబు పొందు దనరన్.

కరిబృంహితము ౨౧-౭౮౨౨౭౧

U||భ|||నU||భ|||నU||భ|||నU|Uర.

మూఁడు భనములు రేఫమును బదు - మూఁట విరతియు సొంపుగాఁ
గూడుకొనఁ గరిబృంహితము సమ-కూర్చి వసుమతి మండలా
పీడ మనుకరిబృంహితరవము - పెల్లుగఁ బలుకుచుండఁగాఁ
గోడిగపు[1]చిననాఁడు శకటునిఁ - గూల్చినహరి నుతించెదన్.

కనకలత ౨౧-౧౦౪౮౫౭౬

|||న|||న|||న|||న|||న|||న||Uస.

జవమున భగభగ యనుచు వ్ర-జజనములఁ బొదవినం
దవశిఖి నుడిపినమధుమురి - నరకదమన యని పే
లవముగఁ బలుమఱు నిరువది - లఘువులు గము పదుమూఁ
డవయెడ విరతిఁ బొసఁగిన బెడఁ గడరుఁ గనకలతన్.

వ. ద్వావింశచ్ఛందం బగునాకృతియందుఁ బ్రతిపాదంబున నిరువదిరెండేసి యక్షరం
బులై ౪౧౯౪౩౦౪ వృత్తములు పుట్టినందు:—

మహాస్రగ్ధర ౨౨-౬౦౯౭౭

||Uస UU|త UU|త |||న ||Uస U|Uర U|Uర Uగ.

స్తుతవ్రాగ ల్వీరించా-ష్టవిరతులు మహా-స్రగ్ధరం జెప్ప నొప్పన్
గ్రతువిఘ్నం బావహిల్లం - బ్రమదమున వ్రజ-వ్రాతదత్తాన్న మెల్లన్
క్షితిభృద్రూపంబున న్మా-క్కిన రుష నమరా-గ్రేసరుం డంప మ్రుబ్బుల్
ధృతిమై జాల్వావఁ [2]గూల్పన్ - దివిరి కరుణతో-[3]ధేనువృద్ధ్యద్రి మోఁచెన్.

భద్రకము ౨౨-౧౯౩౦౭౧౧

U||భU|Uర|||నU|Uర|||నU|Uర|||నUగ.

భంబు రనత్రయంబు గమూ నొంది - భానుయతి భద్రకంబు దనరున్
బంచినపిల్లగోల కరయుగ్మ - పాదములఁ బట్టి యూఁది పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ - గాచుసమయంబున న్యమున తీ
రంబున గొల్లలం గలసి యోగి-రంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకన్.

---

1 చిననాడుటకుసల. (పె). 2 గూల్పన్ (ఓ); గూల్వన్(ప) గుర్వన్ (పూ. ము). 3 ధేనువర్ధాద్రి (పూ.ము).

### మానిని ౨౨-౧౭౯౭౫౫౯

∪IIభ∪IIభ∪IIభ∪IIభ∪IIభ∪IIభ∪IIభ∪గ.

రాజిలు సప్తభము ల్గము విశ్వవి•రామము మానినియందు భర
ద్వాజముఖప్రమునీశ్వరు లందఱు • దైత్యగురుల్ భృగువాక్యమునన్
రా జలనాయకతల్పుని దైవత•రాజు నజస్రము గొల్తురు వి
భ్రాజితమోక్షము చేకుఱఁ బుణ్యధ•రాస్థలి నంచు వచించుటచేన్.

### విచికిలిత ౨౨-౨౦౯౭౧౫౨

IIIన IIIన IIIన IIIన IIIన IIIన IIన∪గ.

ప్రవిలయసమయమునను బద•పడి జలనిధినడుమ స
ద్భువనములు కడుపున నిడుక • భుజగపతిశయనమునై
నవిరళమతిఁ గురుకువరదుఁ • డని విచికిలితఁ బదుమూఁ
డవయెడ వడి యిరువదియొక•లఘువు గము బలుక నగున్.

### తురగము ౨౨-౧౪౯౦౯౪౪

IIIన IIIన IIIన IIIన II∪స I∪Iజ I∪Iజ∪గ.

ననననసజజగలు తిథివిరమ•ణం బగు న్దురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన • గాంచి తా నొకరుం డెదు
ర్కొని దవులకుఁ గొని చని గిరిగుహఁ • గూర్కునాముచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు•ధ న్గణింతురు భూసురుల్.

### [1]ముద్రకము ౨౨-౧౯౪౭౦౯౫

∪IIభ∪I∪ర IIIన∪I∪ర II∪స II∪స IIIన∪గ.

అధ్వమునందు నడ్డ మయి వా•హనాకృతి నున్నబకాసురు మహా
సాధ్వసదు న్వ్రజార్భకవినా•శనక్షము వక్త్రముఁ జొచ్చి సురల్
శ్రాధ్యగులై నుతింపఁగఁ దదీ•యదేహము వెల్లినఁ గృష్ణునుతి న
క్రధ్వజమద్విరామము భర•న్రసానగలుం దగుముద్రకమునన్.

వ. త్రయోవింశతిచ్ఛందం బగు వికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁడేసి యక్షరంబులై ౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె నందు:—

---

1 ఇది (ప) లో మహాస్రగ్ధర తర్వాత ఉన్నది.

కవిరాజవిరాజితము ౨౩-౩౭౯౬ ౯౧౨౦

IIIన|U|జ|U|జ|U|జ|U|జ|U|జ|U|జ|Uవగణము.

కలయఁగ నొక్కన•కారము నాలుజ•కారములు న్వవమై • గాటముగా
నలరినచో ద్విర•దాచలశైలము • లై త్రివిరామము • లంది నిర
ర్గళకవిరాజవి•రాజితవృత్తము • రాణ జనార్దన రమ్యకథా
వళులఁ గవీశులు • వర్ణన సేయఁగ • వ్రాలు నజస్రము • వావిరిగన్.

అశ్వలలిత ౨౩-౪౮౬౧౮ ౨౮

IIIన|U|జ|U|IIభ|U|జ|U|IIభ|U|జ|U|IIభ|Uవగ.

సలలితవిశ్వవిశ్రమము నజ్భ•జ ల్భజభవంబు లశ్వలలితన్
వెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి • చిన్నిసమయంబునందున నులూ
ఖలమునఁ గట్టి వైచినను నిచ్చు • [1]కన్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపినకృష్ణుఁ గీర్తనము సేయఁ • గాఁ దనరు సర్వకాలము ధరన్.

పద్మనాభము ౨౩-౮౯౬౯ ౭

UU|తUU|తUU|తUU|తUU|తUU|తUU|తUUగగము.

వేమాఱు నప్పద్మనాభంబున న్విశ్వ•విశ్రాంతిసూ న్సప్తతంబు ల్గగంబున్
గోమారుగా దేవరాత్రించరుల్ క్షీర•కూపారమధ్యంబున న్వేఁపుమీఁదన్
బ్రామంగ మంథాచలం బోపికం గచ్ఛ•పస్వామియై మోచె నిక్కృష్ణుఁ డంచున్
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ • గ్రాలు న్ధరిత్రి న్సదా మానితం బై.

మత్తాక్రీడ ౨౩-౮౧౯౨౧౮౧

UUUమUUUమUU|తIIIనIIIనIIIనIIIన|Uవగ.

మత్తాక్రీడాఖ్యం బెం పారు • న్మమతననననవ • మహిత మగుచు ర
త్నాత్తబ్రహ్మాశాంతు ల్గ్రం దై • యమరగ రణమున • నధకబలు మదో
న్మత్తుం జాణూరక్రవ్యాదు • న్మఘురనడుమఁ బెడ • మరలి పిడికిటన్
సత్త్వామాత్రుం డుర్విం గూల్చె • న్సకలదివిషదులు • సమతను బొగడన్.

వ. చతుర్వింశతిచ్ఛందం బగుసంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాలుగేసియ
క్షరంబు లై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

---

1 (ప) లో పాఠము ఇందులకు భిన్నముగానున్నది కాని దానిపై గీతలు గీచి
యుండుటచే స్పష్టముగాలేదు. మఱికొన్ని తాటాకుపుస్తకములు చూడవలెను.

సరసిజము ౨౪-౭౩౭౭౧౯౩

∪∪∪మ∪∪।త।∪∪య।।।న।।।న।।।న।।।న।।∪స.

సంబంధించు న్మత్త్యలు నానా॰సలు దశనిధియతి ॰ సరసిజమునకుఁ
గంబూర న్బృందాటవిలోనం ॰ [1]గవిసికొనినసుర॰కరువలిదనుజుఁ
గంబాధిలం బై తగుముష్టిం ॰ జదిపినయమపతి॰ స్తవములు వనురా
గం బూర న్శోభిల్లఁగఁ బ్రాంచ॰త్కృవివరు లభినుతిఁ ॰ గఱపుదు రవనిన్.

క్రౌంచపదము ౨౪-౪౧౯౩౪౨౯

∪।।భ∪∪∪మ।।∪స∪।।భ।।।న।।।న।।।న।∪∪య.

పంచమకేళుం డిచ్చినభాస్వ॰ద్వరమున మనమున ॰ బవరము గోరన్
వంచనతో బాణాసురుహ స్త॰వ్రజములు దరిగెను ॰ వడి హరి యంచు
న్బ్రాంచితలీల న్గంకరనంది॰ప్రకటితవిరతులు ॰ భమసభనాన్యల్
క్రౌంచపదీవృత్తమ్మునఁ జె న్నా॰రఁగఁ బలుకుదు రిలఁ ॰ గవివరు లెల్లన్.

తన్వి ౨౪-౪౧౫౫౩౬౨

∪।।భ∪∪।త।।।న।।∪స∪।।భ∪।।భ।।।న।∪∪య.

దూడలతోఁ గాపరులను గుహలో ॰ దొంగిలిదాచినవిధి నదలింపన్
గూడుక తద్రూపము లయి పసులుం ॰ గోపనఘాటులు మురిపము నొందన్
బాడి వినోదంబులు సలిపినగో॰పాలుఁ డటంచును భతనసభాన్యల్
దాడి గొన న్విశ్వవిరమణముతోఁ ॰ దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్.

అష్టమూర్తి ౨౪-౩౬౧౪౫౨౧

∪∪∪మ।।।న∪∪।త।।∪స∪।∪ర∪।।భ।∪।జ।∪∪య.

శ్రీకృష్ణుం గనకవస్త్రుం ॰ జితతృణావర్తదైత్యు ॰ న్సితకుశేశయనాభున్
వైకుంఠు న్వరదు బృందా॰వనచరు న్వాసుదేవు ॰ న్వసుమయుం బరముం బ
ద్మాకాంతు న్నిధినిధానా॰మలవిరామంబు లొప్ప ॰ న్మనతసద్భజయుంబుల్
సోకం జెప్పుదురు విద్వాం॰సు లిలలో నష్టమూర్తి॰న్సుప్రతిభు లద్భుతచర్యుల్.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసి యక్షరంబు లై 33554432 వృత్తంబులు పుట్టె నందు:—

బంధురము ౨౫-౧౪౩౬౭౨౬౭

।।।న।।।న।।।న।।।న।।∪స∪।।భ∪।।భ∪।।భ∪గ.

సారిది ననననసభభభగములతో ॰ షోడశసంఖ్యవిరామముతో
బరువడి దినదినము బుధజను లీ॰బంధురవృత్తమునందు నుతిం

1 గవసు (ప).

తుర హిమకరకుసుమము నొసటను గ్రన్న న్ఫణిపాగయుఁ దాల్చినయా
దొరజడలనడుమనిలిచిన తెలుపుం ♦ దూకొనువాఁగుకుఁ దండ్రి యనన్.

భాస్కరవిలసితము ౨౫-౮౩౮౧౩౧౧

U||భ|||న|U|జ|UU|య|U||భ|||న|||న||U|స|U|గ.

చెల్లెలి విజయున కిచ్చినవానిం ♦ జేరదుపృథుకములు దినినవానిన్
గొల్లతలకు వలపించినవానిం ♦ గొల్లకుఁ గొడు కనఁ బరఁగినవానిన్
మల్లుర రణమునఁ జంపినవాని ♦ న్భజ్జయభననసగలు పదుమూఁటన్
బల్లిద మగువిరమంబు దలిర్ప ♦ న్భాస్కరవిలసితములు గొనియాడున్.

ధరణిధరగతి ౨౫-౧౬౭౭౭౨౧౬

|||న|||న|||న|||న|||న|||న|||న|U|గ.

వసునములు గము ♦ వసువసుయతులు ♦ వల నగు ధరణిధరగతిన్
గస రొదవి సుడి♦కరువలిపగిదిఁ ♦ గదవి యదుశిశుచయముతో
§మసలెదు నెడ ముర♦మథన నినుఁ గొని ♦ మదిని నలరుచు నెగసి యా
కసమున కెగయఁ♦గ శకటదనుజా♦క్షమఁ గలిపితి వని పలుకన్.

వ. షడ్వింశతిచ్ఛందం బగునుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదాఱేసి యక్షరంబు లై ౬౭౧౦౮౮౬౪ వృత్తంబులు పుట్టె నందు:—

భుజంగవిజృంభితము ౨౬-౩౩౮౫౪౮౮౪

UUU|మ|UUU|మ|UU|త|||న|||న|||న|U|ర|U|స|U|వ|గ.

వ్రాలు న్రత్నే శానశ్రాంతు♦ల్వాహి మమతననరస♦వల్ భుజంగవిజృంభితన్
గాళిందీయోషం బెండ్లాడ ♦ న్ఖరదనుజుఁ దునిమెను శిఖావలాంచితపింఛమున్
మౌళిం దాల్చె న్బండిం ద్రోచె ♦ న్మఱఁదికి రథముఁ గడపె♦మద్దిచెట్టులు రెండు ని
ర్మూలించె న్దాలంబుల్గూల్చెన్♦మాగుదలు భ్రమయమురళి♦ప్రోయఁజేసె విభుం డనన్.

వరాహము ౨౬-౮౩౮౮౬౦౧

UUU|మ|||న|||న|||న|||న|||న|||న|U|స|UU|గగ.

రాజిల్లు న్గశకుధరవి♦రతులు మగణ♦రసనసగగలు వరాహాఖ్యన్
జేజే లందఱు పొగడ ను♦చితుఁ డని తలఁచి భృగువు పలుకఁగ నిత్యంబున్
తేజశ్శ్రీ పెరుగఁగ మది♦దృఢముగ నిడి♦తిమురుచుఁ గొలిచిరి దాశార్హున్
రాజీవాక్షుని నరహరి♦రవికులనరు♦రఘుపతి బలసహజున్ గృష్ణున్.

---

§ ఇచ్చటగణభంగము. 1 మద్దిచెట్టులఁగూల్చెన్, దాలంబుల్గూల్చె న్వేగన్ ముగ్ధలు భ్రమయఁగను మురళిదాలిచెన్ సువిభుండనన్. (పూ.ము). 2 దృఢముగ(ప).

### మంగళమహాశ్రీ ౨౬-౧౫౬౬౫౭౨౩౫

భ॥జ॥స॥న॥భ॥జ॥స॥న॥ నగగము.

పొత్తు లెడఁబాయుటను ♦ బోరుసమయంబునను ♦ బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్
దుత్తుమురు సేయఁగఁ గు ♦ రుచ్చను సునిష నది ♦ దుష్టసమరావనిఁ గిరీటి
క్షత్తకు భజస్న భజ ♦ సానగలు మణ్యాజుల ♦ శ్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర ♦ నిచ్చిరి సువాసినులు ♦ నిం పడర మంగళమహోర్తుల్.

క. పొందుగ నిరువదియా ఱగు, ఛందములం దుదయ మైన ♦ సమవృత్తము లా
నందమునఁ గవులు పొగడెదు, కందువల వచించినాఁడఁ ♦ గా మెపలీశా. 178

వ. ఇవి సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు లెఱింగించెద. 179

### ముఖ్యగౌణవృత్తలక్షణము.

సీ. సమవృత్తపఙ్క్తి స్వ ♦ స్థానార్ధసమములు స్వస్థానవిషమాఖ్యఁ ♦ జను నవియును
బృథివిపై సమవృత్త ♦ భేదంబు లీమూఁటి కక్షరంబులు సమం ♦ బన్నికాళ్ల
నివి వృత్తముఖ్యంబు ♦ లిఁకఁ బరస్థానార్ధసమవృత్తములు పర ♦ స్థానవిషమ
సంజ్ఞలఁ బద్యము ♦ ల్సర్వపరస్థానవిషమంబులును నివి ♦ విషమవృత్త
తే. భేదములు వీనినాలుగు ♦ పాదములను, సమముగాఁ జూపడవు సర్గ ♦ సంఖ్య లెచ్చు
కడమ లై యుండు నీమూఁటి ♦ గౌణవృత్త, పద్యములటం డ్రు శ్రీకొమ్మ ♦ పల్లినిలయ.

### సమవృత్తవివేకము.

గీ. జగతి సమవృత్త మెన్నవ ♦ ఛందమునను, సంభవము నొందె నన్ని య ♦ క్షరము లమరఁ
బదపదంబున హెచ్చును ♦ గొదువ గాక, ప్రాసములు విరామంబులుఁ ♦ బరిఢవింప.

### స్వస్థానార్ధసమవివేకము.

ఆ. అక్షరములు సమము ♦ లయ్యె స్వస్థానార్ధ, సమములందు నాల్గు ♦ చరణములను
విషమపదము లొక్క ♦ విధముగణంబులు, సమపదంబు లొక్క ♦ సరిగణములు. 182

క. సగ మొక్క విధంబునఁ బెఱ, సగ మొక్క తెఱంగు గాఁగ ♦ సమకూర్పఁదగున్
జగతి నొకకొ లొకకరణి, నొగి మూఁడుపదంబు లొక్క ♦ యోజం దనరున్.

తే. సాధుకవికృతగ్రంథసం ♦ జాత మెల్ల, వెదకి సకలోపజాతుల ♦ విచ్చలవిడిఁ
గాళిదాసుఁడు రఘువంశ ♦ కావ్యమునను, జెలఁగి రెండవసర్గలోఁ ♦ జెప్పినాడు. 184

వ. అటు గాన స్వస్థానార్ధసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము. 185

### ఉపజాతివృత్తము.

ఈపాటితో జేసుల ♦ నింద్రవజ్రం, బుపేంద్రవజ్రావ్యాయ ♦ మూర్విసర్గం
దాపించినంతం గరు ♦ ణాసముద్రా, జపిష్ఠలోలా యుపజాతి యయ్యెన్. 186

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాచ్ఛాయను బేసి పాదాలును నుపేంద్రవజ్రాచ్ఛాయను సరిపాదాలును నడుచును. [1]దీనిపేరే నిశ. 187

మఱియు, వ్యత్యస్తోపజాతి.

తలంబులై బేసి జ•తజ్జగంబుల్, చాలొప్ప సర్గం దత•జల్ గగంబుల్
జలంబులోనిట్లు • సాగినంతన్, వాలారు వ్యత్యస్తము • వాసుదేవా! 188

వ. ఇది ఉపేంద్రవజ్రచ్ఛాయను బేసిపాదాలును, ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 189

సమోపజాతి.

తాపింఛనీలాంగుఁ బ్ర•దాతుతల్పున్, గోపాలబాలుం బ్రవి•కోటితేజున్
గృపాసముద్రున్ నుతి•యించెద న్మ•క్షువ్యాపద్గఁ గాంక్షించి స•మోపజాతిన్.

వ. ఇంద్రవజ్రాచ్ఛాయను మొదలి రెండు పాదములను నుపేంద్రవజ్రాచ్ఛాయను గడమ రెండు పాదములను నడుచును. మఱియు, 191

వ్యత్యస్తసమోపజాతి.

తపంబుచేఁ గొల్తు వి•ధాతృతాతన్, గపాలికోదండవి•ఖండనాఖ్యున్
గోపీభుజంగున్ ధృత•గోత్రు సన్నో, త్కోపాయు వ్యత్యస్త స•మోపజాతిన్. 192

వ. ఇది యుపేంద్రవజ్రాచ్ఛాయను మొదలి రెండు పాదములును నింద్రవజ్రాచ్ఛాయను గడమ రెండు పాదాలును నడుచును. మఱియు, 193

వైపరీత్యోపజాతి.

తాజల్గగంబొంట జ•తజ్జగంబుల్, గజస్యాన మ్మాఁటను•గంతు వేయున్
వ్రజాంగనాసల్లభ•వైపరీత్యో•పజాతిప్రాత్తంబు స•భం జెలంగున్. 194

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదలిచరణమున నుపేంద్రవజ్రాచ్ఛాయను గడమ మూఁడు చరణములును నడుచును. దీనిపేరే [2]వాతాంగి యగు, మఱియు నీవృత్తమున నే యింద్రవజ్రాచ్ఛాయను ఏదైన నొకచరణమును నుపేంద్రవజ్రాచ్ఛాయను ఏవైన మూఁడు చరణములను జెప్పినను తప్పులేదు. మఱియును, 195

ఉపచిత్ర.

భిదురంచిసపానలు • బేసులన్, గాదిలి భాభగ•గంబులు సర్గన్
గురు రై రసికస్తుతి•గూడినన్, శ్రీదయితా యుప•చిత్ర చెలంగున్. 196

1 ఈవాక్యము పూ. ము. లలో లేదు.

2. వ రాంగిని (పూ. ము); వారాంగి ముంను నప్పును. (చూ. అ. 4. 207)

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తచ్ఛాయను జేసిపాదములను దోదకవృత్తచ్ఛాయను సరిపాదములను నడుచును. మఱియు, 197

నారీనుతము.

పేరెంబు ల్వారోరిం జేసి న్నతాగా, సారంబు సర్లన్ దతంజల్గగంబుల్
ధీరోద్ధాత్తుల్ సన్నుతింపన్ ధరిత్రిన్, నారీనుతం బయ్యె జనార్దనాఖ్యా. 198

వ. ఇది పదునొకొంటం ద్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తచ్ఛాయను జేసిపాదములును నింద్రవజ్రాచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 199

అజితప్రతాపము.

జలజాక్ష! జేసుల సంజల్ ససలున్, బలుమఱున్ సరి నంభజ లొందఁగా
జలజోద్భవాబ్జజవింశాలయతుల్, దళము లైన యజింతప్రతాపమా. 200

వ. ఇది పండ్రెండవ జగతీచ్ఛందస్సునందలి ప్రమితాక్షరావృత్తచ్ఛాయను సరిపాదములను బ్రియంవదావృత్తచ్ఛాయను జేసిపాదములను నడుచును. మఱియు, 201

రతిప్రియము.

జేసి న్నరగలుం పేర్చి సర్ల జంబున్, ఘసజ్జగల్గదిసినంపాదబద్ధ మై
యాసామోద్భవచతుంరాస్యవిశ్రమఖ్యాతి సన్నుతింపఁదగు రంతిప్రియం బనన్.

వ. ఇది పదుమూఁడవ అతిజగతీచ్ఛందస్సునందలిప్రహర్షిణీవృత్తచ్ఛాయను జేసిపాదములును రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును. 203

ఇది స్వస్థానార్ధ సమవృత్తలక్షణం బింక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన:—

స్వస్థానవిషమవృత్తవివేకము.

ఆ. చరణములను వర్ణసంజ్ఞలు దప్పక, నాల్గుపాదములగణములు నాల్గు
విధము లై చెలంగువృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంఖ్యవెలయుచుండు. 204

ధరణి.

రసపై సచతుష్కము రారసలున్, నాససల్ మాససల్ నాటిన న్మణితా
పసనగరసంపరిపక్వయతు, లాఱి సొం పారు న్వాంలాయము గా ధరణుల్. 205

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమునను గడమమూఁడుచరణములను గవికల్పితము లై నడుచును. మఱియు, 206

వాతాంగి.

తాజ ల్గయుగ్మంబు జంతజ్గగంబుల్, తజాగగంబుల్ మభంతల్లగంబుల్
రాజిల్లు నిభేంద్ర విరామయుక్తిన్, వ జగ్రీవ హరింవాతాంగి దనన్. 207

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునను నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండవచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయను నాలవచరణమునను నడుచును. మఱియు, 208

### అంగజాస్త్రము.

రంగు భమస్గల్ గ్రాలు మసజ్గల్, పొంగె మన్యగము ల్రజగ్గ లో
ప్పంగా నార్తవగిరివ ల్లితే, నంగజాస్త్రవృత్త మందగించుఁ. 209

వ. ఇది రుగ్మవతీచ్ఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయను మూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచరణమునను నడుచును. మఱియు, 210

### నదీప్రఘోషము.

పోలిమై రారరంబుల్ జతజ్రంబులుఁ
తలంచఁగా యాయములుఁ దతజ్రలుఁ
విలాసాచలాష్టీభవిశ్రాంతితోడఁ
దేలింప నొప్పారు నదీప్రఘోషముల్. 211

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును. 212

ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్ధసమవృత్తవివేకం బెఱింగించెద:—

### పరస్థానార్ధసమవృత్తవివేకము.

క. మానుగ సమాంఘ్రి లోకగతిఁ, బూనిక విషమాంఘ్రి లోకపు పోలికలిపు రై
హీనాధిక్యములు పరస్థానార్ధసమంబులందు సమవిషమములఁ. 213

### మనోహరవృత్తము.

పేరైన తజజ్జ్యలు బేసియెడఁ, సరులఁ సచతుష్కము సాగిన గం
భీరేభ పితామహ విశ్రమముల్, పెరుగంగ మనోహరవృత్తము లౌ. 214

వ. ఇది కలితాంతవృత్తచ్ఛాయను బేసిచరణములును దోటకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 215

### కేతుమతి.

జతబేసుల స్సజనగముల్, భాతి సరిఁ భరేఫసగగంబుల్
యతి శైలసంఖ్య నమరఁగా, నాతత కేతుమత్యభిన మొప్పుఁ. 216

### వేగవతి.

సగణత్రయగ♦ల్బను జేసిన్, బాగుగ సర్లను ♦ భత్రిగగంబుల్
నగవిశ్రమ మం♦దము నొందున్, వేగవతీసుత♦వృత్తమునందున్. 217

### వియోగిని.

ససజల్ గము♦సాగ జేసులన్, బసభ్రల్గము ♦ భాసిలున్ సరిన్
రసశైలవి♦రామసంగతిన్, బొసఁగు న్వియోగిని ♦ భూరమాధిపా. 218

### పరావతి.

ఓలి రజ్రజాంతగంబు♦లుంచి జేసులం,దులన్ జరజ్రగంబులుం [1]గు♦దుర్చరింపన్
గ్రాలుచు న్నిధానదిగ్వి♦రామ మొప్పఁగా,నిలం బరావతీసువృత్త♦మింపుగాంచున్.

### ధృతమధ్య.

బారిగ జేసుల ♦ భాభగగంబుల్, సగుల నజాయులు ♦ సాగఁగ మేల
య్యారి శిలోచ్చయ ♦ మాస్తివిరామా, [2]దారత నొప్పును ♦ దా ధృతమధ్యన్. 220

వ. ఇది దోదకవృత్తచ్ఛాయను బేసిచరణములును తోదకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 221

ఇది పరస్థానార్ధసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవివేకంబెఱింగించెద:—

### పరస్థానవిషమవృత్తవివేకము.

క. దానవహర యొకచరణం, బైనను రెండడుగు లైన ♦ నక్షరగణసం
ధానములను బెఱతెఱ వగు, వీనికిఁ బేరు పరదేశ♦విషమము లయ్యెన్. 222

### శరభక్రీడ.

ఘనాదిత్యక్రాంతి న్యమనసర♦గ ల్మూఁడు కాళ్లన్
గనద్ధాత్రక్రాంతి న్మభసయుజ♦గద్వంద్వ మొందన్
దనర్పంగాఁ బౌరాణికకథల♦దాశార్హ వాస్తు
వ్య నర్హాం బై చెన్నార వనిశర♦భక్రీడసంజ్ఞన్ [3] 223

వ. ఇది చంద్రశ్రీచ్ఛాయను బ్రథమచరణమును విశాలచ్ఛాయను మూఁడుచరణములను నడుచును. 224

---

1 గుదిరింపఁగా (పూ. ము) ఛందోభంగము. 2 ఈచరణము రెండవచరణమువలెలేదు. అన్ని ప్రతులందును ఇది ఇట్లేఉన్నది. 3 ఇందు నాలుగు చరణములును చంద్రశ్రీచ్ఛాయనేఉన్నవి. రెండవచరణము గనద్ధామక్రాంతిన్మభనయుజ♦గద్వంద్వ మొందన్ (పూ. ము).

### శ్రీరమణము.

ఆది భమస♦గ్గల త్రిన నాప్తె, గాదిలి భాభగ♦గంబులు మూఁటన్
బాదుకొనం గవి♦పల్కినచో లక్ష్మీవయితా ధర ♦ శ్రీరమణం బౌ. 225

వ. ఇది రుగ్మవతీఛాయను దొలిచరణమును దోదకచ్ఛాయను మూఁడుచరణములును న
డుచును. 226

### రథగమనమనోహరము.

గ్రథితనయుగరల♦గంబులుంబొసంగం, బ్రథమపృథ్వీయుచతుర్థ♦పాదములు వ్యంచింపన్
విధివశయుతు లొంది♦వింతగా నజార్యుల్, రథగమనమనోహ♦రం బగున్ ధరిత్రిన్.

ఇది పరస్థానవిషమవృత్తవివేకం బిఁక సర్వపరస్థానవిషమవృత్తవివేకం బెట్టి దనిన:—

### సర్వపరస్థానవిషమవృత్తవివేకము.

క. ఊర్విని నాలుగుపదములఁ, బర్వినగణములను వర్ణ♦పఙ్క్తిగణనయున్
సర్వము విపరీతం బగు, సర్వపరస్థానవిషమ♦సంజ్ఞలను హరీ. 228

### వీణారచనము.

దారిఁ దయసాగ లతిత♦జ్ఞభగాలు, న్యారించి తజ న్యసలు భ♦నాజనగంబుల్
శేర న్మణిదిగ్గళశి♦శేఖరవలి వీ,ణారచన ధరఁ దెలఁపును ♦ నారదవినుతా. 229

### [1]ఉద్ధతము.

అగువార ను♦ద్ధత మయ్యె, న్నరి సజయులున్ ♦ నసజ్గలున్
బాయభనజగలు ♦ పజ్సలున్, ధర మణ్మహేంద్రగజ ♦ ధాత్రియతిన్. 230

### మధుర.

వసమధురాఖ్యము ♦ విన్నజారగల్ నా
రసలగములు మీద ♦ రాగనమ్యయుల్
నసజజజగ లొందన్ ♦ దంతిరత్నజది[2]
క్ప్రిసరవిరమంబు జెంది♦రసందనరారజా! 231

వ. ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమునను అపరాజితచ్ఛాయను రెండవచరణము
నను మాలినిఛాయను మూఁడవచరణమునను నడుచును. నాలవచరణముకవికల్పితము.

### మణిదీపిక.

గురుపితామహముఖ్యులఁ గినిసి ♦ ఘోరరణములోఁ
దెరలిచె నరుఁ డని పలుక రత్న♦దీపిక ల్దనరును న

---

1 ఉద్గతము (వ్రా. ము). 2 ఛందోభంగము-నినరగణము యగణమై యుండవలెను.

ఘరనభభ్న భస ల్నా నాసజ•కారభసలు నభర్వనసనసలు
న్భరసజాగలు భూపతు ల్వినభానువిక్రమయుక్తితోన్. 233

ఉ. ఈసమవృత్తరాజి నుద•యించువిరామములు న్గణాంబులుం
బ్రాసము లెల్లఁ దప్పక న•మర్చి వచించిన నైదువృత్తవ లై
భాసిలు వృత్తపద్యము ల•పారము లై విషమాహ్వయంబు లై
వావికి నెక్కు శిష్టజన•పాలన దుష్టనిశాటచాలనా. 234

ఇది పంచవిధవృత్తవివేకం బింక వైతాళీయజాతివృత్తంబు లెఱింగించెద:—

మ. ప్రకటింతు న్ధర దక్షిణాంతికయు నౌ•పచ్ఛాందసంబుం బ్రవ
ర్తక యాపాతలికాపరాంతికలు వై•తాళీయము న్జారుహా
సిక ప్రాచ్యంబు నుదీచ్యవృత్తి యనఁగాఁ • జెన్నారువృత్తంబు లిం
దుకులశ్రేష్ఠ యనేకము ల్గలుగు నం•దుం గొన్ని వాక్రుచ్చెదన్. 235

క. ఖ్యాతిగను రగడలందును, వైతాలీయాఖ్యవృత్త•వారములందున్
బీతాంబరగురువునకు, బ్రీతిగఁ గృతుల న్లఘువులు • రెండేసి యగున్. 236

దక్షిణాంతిక.

ఊరుసాజగ • లుండు చేసులన్, సరులం దూకొను • సద్భవంబులన్
దొర లేడిటఁ • దొమ్మిదింట రా, ధరలోఁ జెన్నగు•దక్షిణాంతికల్. 237

ఔపచ్ఛాందసము.

ఇమిడి సలము•లేడు తొమ్మిదింటన్, సమకూఱు న్యతి•సద్ధ రేఫయుంబుల్
సమత న్వనుల•సహ రేఫయుంబుల్, క్షమలో నౌప•చ్ఛాందసంబు మించున్. 238

ప్రవర్తక (వర్తక).

స్థిర చేసి ను•దీచ్యవృత్తియున్, బరఁగు న్సర్గను • బ్రాచ్యవృత్తియున్
గిరిమణియతి•కీలితంబుగన్, బరముఁ గొల్వఁ బ్ర•వర్తకాఖ్య మా. 239

ఆపాతలిక.

లము లాఱు వలున్భగగంబుల్, లము లెనిమిదిటికడన్భగగంబుల్
క్షమ గిరినవ•క్రాంతులుం దగున్, బ్రమథితముర యా•పాతలికాఖ్యల్. 240

పరాంతిక.

ఇలవర్తక•వృత్తరీతితోఁ, దుల లై పాదచ•తుష్టయంబులన్
బలసినయది • పద్మనాభ చెన్నలరు గృతులఁ బ•రాంతికాఖ్య చే. 241

## వైతాలీయము.

ఋతులఘువులు • రేఫవంబులుఙా, ధృతవములఘువులు • రేఫవంబులుఙా
జత సమతాన • సారసాక్షి పా, లితశుక వైతా•లీయవృత్తమా. 242

## చారుహాసిక.

[1]త్రమదమునను • వర్ణకాఖ్యావృ, త్తముచందంబున • ధాత్రి సత్కవుల్
సమతూర్చిన•శార్ఙ్గకార్ముకా, సమత స్నీఋను • జారుహాసికల్. 243

## ప్రాచ్యవృత్తి.

తొలి నేడిటఁ • దొమ్మిదింట రాం, తులు పదునాలుగు•దూఋ చేసులం
•దులఁ బదాఋ•తొంగలించు స్వర్ణలలి న్నాధవ•ప్రాచ్యవృత్తి యా. 244

## ఉదీచ్యవృత్తి.

తమ కిర వగు•దక్షిణాంతికా,ఖ్యము తేజంబున • నందగించు మే
లిమిశ్రుతులఁ గ•డింది వేలుపా,తిమురు న్నాత్రి ను•దీచ్యవృత్తికల్. 245

ఇది వైతాలీయజాతివృత్తవివేకం బింక మాలికావృత్తవివేకంబు లెఱింగించెద:—

## మాలికావృత్తవివేకము.

తే. మాలికావృత్తము లనంగ • మఱియు నైదు
దనరు నిరువదియాఋ ఛం•దముల మించి
యల లయగ్రాహి లయవిభా•తి లయహారి
గదసహాజత్రిభంగియు దండ•కంబు లనఁగ. 246

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదియక్షరములపద•ములయంఘ్రులు నా
ల్గొప్పయతిప్రాసంబులు, గుప్ప లయగ్రాహి యనఁగఁ • గొమ రొందు హరీ. 247

## లయగ్రాహి.

ఇం బడరఁగా భజస•నంబులతుద న్భజస•నంబులపదంపడి భ•యంబులు లయగ్రా
హింబరఁగుప్రాసవిర•మంబునలుమాఋగుదు•రంబటుక వీశులఁతి•రంబుగ వచింపఙా
నంబరముగా వలసి•తొంబగలి దానవక•దంబము సహాయముగఁ•బంచి త్రిదశు ల్దు
గ్ధాంబునిధి ద్రచ్చి యమృ•తంబు గొనఁజాలఁ సమ•యంబు దొరకించితి ము•దంబున
ముకుందా. 248

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదినాల్గరమపద•ముతదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయవిభాతి యనఁగఁ • గొమ రొందు హరీ. 249

---

1 ప్రథమ (పూ. ము.) ప్రాసభంగము.

## లయవిభాతి.

పెనిమిటులు భార్యలును దనయులను గాంచిరటె మనమలర దొడ్డతప మునవలదశ
స్యందనుఁడు సుతికోసలియుఁ దనకడుపులోపల భువనము లఖిలంబు నిడుకొనిన
కొడుకున్ రామునవినసనద్వయము వెనుకనసగంబులును జొనిపియతులుండు నెడలన
లుమెఱుఁ బ్రాసంబునిలిపి కవీశ్వరులు మును లయవిభాతి నిటు నినువినుతిసేయుదురు
వనజదళనేత్రా. 250

క. ముప్పదితొమ్మిదిమాత్రలు, ముప్పదియేడర్ణముపద ముతదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్పిన లయహారి యనఁగఁ గొమరొందు హరీ. 251

## లయహారి.

నగణములుపదునొకడు సగణమునుగురువునిడి మిగులనలుమఱుయతులు దగులలయ
హారిక్, బెగడిశతధృతిపరిప రిగతుల మెఱయుడినమ రిగిరఘుపతనువుఁబొడివి నిగిడి
చనియంతక్, నిగమములు గొనివెసను జగము లద్రువఁబఱచి రయు దిగికడపలిజడధి
ము నిగినవభయార్తిక్, బెగడుచునొడినికరచి తెగఁగొనినతురగగళుఁ డగుహరివనఁగ
ముకవు లగణుతిచెలంగుక్. 252

క. ఇది నేత్రాంబుధిలము మ్ముప్పదినాలుగువర్ణములను బాదం బగుఁ ద
త్పదచాతుర్థికములచే, నొదవుఁ ద్రిభఁగి యనువృత్తి ముర్వరలోనక్. 253

## త్రిభంగివృత్తము.

వినువక [1]సుకవులు రసఁబ్రతిపదమున హాసగగమూఁడొకతీరై మఱివేఱైమూఁడొక
తీరై, రసనగణములును సనభసగములును పొసఁగినషడ్యతిసంగి వ్రణతింగింజెల్లుఁద్రి
భంగిక్, మసలెదు వ్రజమున దుసికిలి మధురకుఁగనికిసమృద్ధశుభాంగిందగుభంగిం
జేరిత్రిభంగిక్, వెసమనిచినవ బిసరుహనయనయని సభలవేద్యగురింతుక్ విను
తింతుక్ నిచ్చలుఁగాంతుక్. 254

క. ఇదినియమము లేనిమహా, పథమునఁ గావలసినంత [2]పక్షాణింపక్
గొద లేక నమరు దండక, మదధీంద్రశయాన తాపకోత్తమనుతులక్. 255

## దండకము.

విద్వాంసు లెల్లక్ హకారంబె కాని నకారంబె కాని సకారంబె కాని వచిం
పం దగున్మందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁది
వెల్లం దకారంబులే మెండుగా నిచ్చుకు స్వచ్ఛనందాఁకనిర్మించి గుర్వంతముం జేసిన
న్దండకం బంద్రుభక్తానయాయి భుజంగేంద్రశాయీ పయస్తక్రదధ్యాదిక స్తేయి

1 సుపలురస (పూ. మా). ఛందోభంగము. 2 పక్షాణింపక్ (ప); పక్షి
ణింపక్ (ఓ).

నైర్మల్యతాపింఛగుచ్ఛచ్ఛవిస్వచ్ఛమాయూరపింఛావచూడాసదాపూతబృందాట
వీ మధ్యరథ్యాసమారాధ్యతధ్యార్భక క్రీడహేమేక్షణా ఖర్వదోర్గర్వసంభూతస్వ
ర్వైరరాభారనిర్వాహకార్ధాంగితక్రోడ చండప్రభామండితానేకమార్తాండకోటి
ప్రతీకాశ నానావిధస్తోకలోకేశ వైకుంఠసంవేశ ఘోషాంగనాలోల కాదంబిని
నీల గోపాలబాలా నమ స్తే పున స్తే నమః. 256

క. దండిగ నేకపదంబున, నుండెడివిన్ నాల్గడుగుల నుండెడివిన్ వే
దండావన దండకముల, పిండువు దనరారుఁ జండవృష్ట్యాదికముల్. 257

దండకము. ధూర్తుల్ నకారంబులున్ రెంటిపై సప్తరేఫంబులుం గూర్చినం జండవృష్ట్యా
ఖ్య మయ్యె న్నకారంబులు న్రెంటిపై నష్టరేఫంబులుం గూర్ప నర్ణాఖ్య మయ్యె
న్నకారంబులు న్రెంటిపై రత్నసంఖ్యాకరేఫంబులుం గూర్చిన [1]న్నర్ణవం బయ్యె
నోలి న్నకారంబులు న్రెంటిమీఁదం దశఖ్యాతరేఫంబులుం జెప్పినన్ వ్యాళ
మయ్యె న్నకారంబులు న్రెంటపై రుద్రసంఖ్యాకరేఫంబులు న్నిల్ప జీమూతమయ్యె
న్నకారంబులు న్రెంటిపై నొప్పు పండ్రెండు రేఫంబులుం జెంది లీలాకరం బయ్యెఁ
బేర్మి న్నకారంబులు న్రెంటిపై మించు పద్మూఁడు రేఫంబులు న్నంత నుద్దామ
మయ్యె న్నకారంబులు న్రెంటిపై రూఢిఁ బద్నాల్గు రేఫంబుల న్శంఖ మన్దండకం
బయ్యె నిరీతితోడ న్నకారంబులు న్రెంటితర్వాత నేడాదిగాఁ గారకారంబు లొప్పా
రఁగా నంఘ్రి నొక్కొక్క టెక్కించి కావించినం జండవృష్ట్యాది నానాలసద్దండ
కంబుల్ ప్రసాధించుఁ గాకుండె నాల్గంఘ్రులుం జేయఁగా వచ్చు [2]నిరీతి నేకోన
సాహస్రపర్యంతముం గూర్చి యిచ్ఛావిధిం జెప్పఁగావచ్చు గాంతంబుగా రాధికా
జార శ్రీరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథవాఃకేళికాసక్త
గోపీజనోత్సృష్టవస్త్రాపహారాశుకాస్యోక్తవాక్యామృతాంభోధిచంద్రోదయా
సాంద్రదేవా నమ స్తే పున స్తే నమః. 258

జాత్యుపజాతినామములు.

క. జాతులు నుపజాతులు నన, భూతలమున రెండు భేదములు జాతులలో
జాతులు కందాదిక ముప, జాతులు గీతాదికములు సరసిజనయనా. 259

సీ. కందభేదము లాఱు గాక నుత్సాహంబు తరువోజ మధ్యమాక్కరలు నైదు
దీపించుమంజరీద్విపదత్రిపదచతుష్పదపంచపాదిషట్పదవిధములు
తొమ్మిదివిధములతో నొప్పురగడలు కళికలు నుత్కళికలును గూడ
జాతులు నవవిధగీతంబులును సీసస ప్తకంబును నుపజాతు లయ్యె

---

1 న్నర్ణవం (పు.మూ.). 2 నితీరు (ప).

తే. యనుచు నన్నయభట్టు • భీమనయుఁ బెద్ద
సచివుఁడును మూర్తి తాత[1]నా • జ్ఝలు ననంత
మంత్రియునుఁ దిమ్మరాజు ని • మ్మాడ్కిఁ జెప్పి
రందముగఁ దాము చేసిన • ఛందములను. 260

జాత్యుపజాతినిరూపణము.

క. గురులఘువులలో నెయ్యది
మురసంహర ప్రథమపాద • ముఖమున నిలిచెన్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరఁగ నిలుచు నవియె నాల్గు • పదములమొదలన్. 261

మ. ధరణిన్ జాతుల కాదివర్ణ మొకఁడే • తప్పంగరా దెల్లెడన్
వారి తజ్జాతిగణంబులైన సరి యి • ట్లట్లైనఁ గావచ్చు సుం
దరధారీ యుపజాతులం బ్రథమవ • ర్ణంబు న్యథేచ్ఛంబుగా
సారదిం జెప్పఁగ వచ్చుఁ బ్రాసములు ని • ల్చు న్వర్ణకై యొక్కచోన్. 262

క. తెలియఁగ వినుమీ కామే, పలినామగ్రామధామ • ప్రస్తుతపద్యం
బులు గీతకందసీసా, దులు విరతిగణనియమములతో • వివరింతున్. 263

క. గురులఘువుల పేరిటియ, క్షరములు నష్టగణనామ • కము లగులిపులన్
సురరిపుగర్వతమోభా, స్కర దీర్ఘము లైన రెండు • గా నెన్నఁబడున్. 264

కందషట్కాభిధానంబులు.

గీ. పరఁగఁ గందము పథ్యయు • మరి విపులయుఁ
జపలయును ముఖచపలయు • జఘనచపల
యనఁగ గందపద్యంబు లీ • యాఱువిధము
లఖిలసుకవికృతులలోన • నలరుచుండు. 265

సీ. నలగగభజసగ • ణంబు లేనుసు కాని కందంబునకు నొండు • గణము సొరదు
[2]వీఁటిలోపల నొక • మూఁటిచే వడి లేనిహీనపాదము సుండుఁ • గానఁబడును
దరువాత దీర్ఘపా • దము పంచగణములఁ దగుదాని మూఁడవ • తావునందు
నలజలు దక్కంగఁ • గలయ వామీఁద నే యతి దాఁకు నిజపదా • ద్యక్షరంబు
తే. తుదిని గాసలు దక్కంగఁ • గదియ దొకటి, కొంచెపడుగుల బేసుల • గొప్ప కాల
సరుల జగణంబు గూడదీ • చరణయుగము, భువిని సగమయ్యె రెట్టింపఁ • బూర్ణమయ్యె.

1 నాఝ్ఝ (వ). 2 వ్రాతప్రతులన్నిటిలో 'వీఁటి' అనియేయున్నది.

ఇది సమస్తప్రబంధములందుఁ జెప్పెడుసహజకందపద్యలక్షణము:—

పథ్య.

ధరలోఁ బథ్యాకందము, వారి యగు నాఱవయెడ నల ♦ మాఱిటికై
విరతియుఁ గూడఁగ మూఁటను, నెరయుఁ జతుర్గణములు గము ♦ నిలిచినచోన్.

విపుల.

క్షమ వెలిశాలు సమపా, దములోఁ జేర శబ్ద మొకటి ♦ తనరింపన్
సముధికపథ్యాకందము, గమనిక విపుల యన నలరు ♦ కంద మగున్. 268

చపల.

[1]సమపదముల మొదలం జగ, ణము గడమునుగునను ద్విగ♦ణలఘువుపై
[2]సమకొనువిరతియు పదియేన్, లముల్ ముకుంద చప♦లకు నమరున్. 269

ముఖచపల.

స్థిరఁ జపలాకందమువై, ఖరిన్ మొదలియుగుగు చెప్పఁ♦గఁ గవులు పె
ట్టిరి ముఖచపల యనెదుపే, రరిసిగ వైకుంఠ వరద ♦ యఘుజైత్రా. 270

జఘనచపలాకందము.

క్షమఁ బథ్యరీతిఁ బూర్వా, ర్థము చపలాకందముక్రియఁ ♦ దగు నపరా
ర్థము జఘనచపలకు మునిం, ద్రమానసమరాళ♦దాశార్హా. 271

క. గురువొకటి రెండులఘువులు, సరియైనకతమున వృత్త♦చయములఁ దక్కన్
వెరజాత్యుపజాతులు వి,బ్బరముగ నెవ్వైన నిలుప♦నచ్చున్ గృతులన్. 272

ఉత్సాహలక్షణము.

[3]ఈహ మీఱ సూర్యగణము♦లేడు గాంత మైన ను
త్సాహవృత్త మనఁగఁ గృతులఁ ♦ జాగుచుండు సత్కవి
వ్యూహనుతులు గాంచి కృష్ణుఁ ♦ డొడిసి కాళ్లు పట్టి పెన్
ద్రోహి చావు మనుచు ఖరునిఁ ♦ద్రోచెఁ గాళ్లు మీఁదుగాన్. 273

తరువోజ.

శతమఖత్రితయంబు♦జలజాప్తుఁడొకఁడు శతమఖత్రయిమీఁదఁ ♦ జనువిశ్రమంబు
ప్రతిభ నియుడుగులో♦ప్పఁగ రెండుగూర్పఁ బ్రతిమీఱనొక్కొక్క♦ పాద మొలవరఁ

1 సమపదముల మొదలం జగ,ణముగడపాదమునకు ద్విగ♦ణలఘువుపై (ప.ఓ.). ఇందు రెండవపాదమున మొదటిగణము జగణముకాదు. 2 సమకొనుయతియాఱవయది, లమామకుందచప♦లకునమరున్(పూ.ము). 3 ఈహ కారణక్ర (ప.ఓ.).

జతురంఘ్రి లీరీతి•జత కూర్చి సుకవి చతురవాచారూఢి•జలజాక్షునుతులఁ
గృతులందుఁ దరువోజ•నమోజ నెసఁగఁ గృతకృత్యుఁడై చెప్ప•క్షితి నెల్లసభల.

పంచవిధాక్కరంబు లెట్లివనిన:—

క. మధుదమన పురందరధా, మధిచంద్రగణాలిచే త్రి•మ మహామధ్యా
మధురాంతరాల్పపూర్వ, గ్రథితాక్కర లైదు దనరు • గ్రంథములందున్. 275

మహాక్కర.

నూరుఁ డొకఁడును మున్నుగాఁ దర్వాత • సుత్రాము లేవురు పిఱుఁద నొక్క
తారకేశుండు జత యైన నిట్లిస• ప్తగణంబు లొక్కపాదంబునకుఁ
జేరు రెండవచోట నాలవచోటఁ • జిత్రభానుగణంబు గదియుచుండు
నోరసిలు నాలవగణంబుపై క్రాంతి • యుత్పలాంగ మహాక్కరంబునకు. 276

మధ్యాక్కర.

మునుపుగాఁ బ్రాసంబు గూర్చి • మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్రయుగళంబుమీఁద • కలజాప్తు నొక్కనిఁ జేర్చి
యినుమడించిన నాఱుగణము • లెనసిన నొక్కపాదంబు
దనర వక్కాణించినంతఁ • దగు నిట్టు మధ్యాక్కరంబు. 277

మధురాక్కర.

మురనిశాటేంద్రసంహర • మూఁటిపై విరతు లుంచి
తరణిశక్రత్రయంబు సు•ధామయూఖునితోఁ గూర్చి
వరుసతో నేనుగణముల•పాద మొక్కటి యొనర్చి
దొరలఁ జెప్పిన నొప్పుఁ గృ•తుల మధురాక్కరంబు. 278

* అంతరాక్కర.

[1]భానుఁ డిద్ద ఱాదిత్య•పతులు చంద్రుండు
పూని నాలుగుచరణ•ములఁ ద్రిగణాంత
మైనవర్ణంబు విరతి • నంతరాక్కరంబు
భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర. 279

---

1 భానుఁ డిద్ద రాదిత్య•పతులు తమిస్రాపతియు, జానుమీర నివాలుగు • చరణములకు త్రిగణాంత, మైనవర్ణంబువిరతి•నంతరాక్కరంబు, భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర (ప. ఓ.). *భానుఁ డిద్ద ఱాదిత్య•పతులు చంద్రుండు, పూని నాలుగు చరణ•ములఁ ద్రిగణాంత, మైనవర్ణంబువిరతి•నంతరాక్కరంబు, భానుశీతాంశు నేత్ర•పద్మాకళత్ర. ఛందోభంగములేకుండ నిట్లు సవరణ చేయదగునేమో ?

అల్పాక్కర.

విరమంబు రెంటిపై ♦ విస్తరిల్లి, సురపు లిద్దఱు నొక్క ♦ సోముండు రాఁ
జరణ మీమూఁటిచే ♦ సాగి యొప్పు, హరిపపర్యంక ♦ యల్పాక్కరంబు. 280

మఱియు, మంజరి.

తుద మొదళ్లను [1]నంటి ♦ దూఁగు శబ్దంబు, సర్జించి యతి మాఱు ♦ ప్రాసంబు లిడక
ప్రాసంబులేనిద్వి ♦ పద యై చెలంగఁ, బ్రాసంబుతుదలందుఁ ♦ బదిలంబు చేసి
[2](సాగింపఁగాఁ జాల ♦ సత్కవీశ్వరులు, మోదంబు పెంపార ♦ భూమిలోపలను
బద్మాక్షుఁ డెపుడు చే ♦ పట్టు మంజరుల, చందాన నలరారు ♦ జగతి మంజరులు.) 281

ద్విపద.

సురపతిత్రితయంబు ♦ సూర్యుఁ డొక్కండు
విరమంబు రెంటిపై ♦ వెలయు నొక్కటికి
క్షితిఁ దగ నిరెంటి ♦ చే నొప్పు ద్విపద
మితి లేక చెప్పిన ♦ మే లండ్రు కవులు. 282

త్రిపద.

తొలుతను నల్వు రిం ♦ ద్రులు రెంట మూఁటను
బలభిద్ద్వయంబును రవియు ♦ వళి లేక నలరారుఁ ద్రిపద. 283

చతుష్పద.

జలజాసనవిశ్రమ ♦ సంయుతమై, లలి షోడశమిత ♦ లఘువులతోడన్
గలసి చతుష్పద ♦ గతులను ధరలోన్, జెలు వగుఁ జౌపద ♦ సేవకసులభా. 284

వితాళచతుష్పద.

[3]భానుయుగము పై ♦ పయి నవల నిం, పూన మణివిరతి ♦ నొంది ధరలోఁ
జా నలరుఁ జతు ♦ ష్పదవితాళా, ఖ్యానమున వినా ♦ యకతురంగా. 285

కర్ణాటచతుష్పద.

మొగిఁ బంచలఘుగణం ♦ బులు మూఁడు రవియుఁ
దగుతుదఁ బ్రాసంబు ♦ దాఁక రెంటిపయి
నగువిశ్రమమ్ము క ♦ ర్ణాటచౌపద యై
సఁగుఁ గృతుల సత్కవుల ♦ సమ్మతముతోడ. 286

---

1 నంటితూఁకు (ప); నంటుతూఁను (ఓ.). 2 ఈ రెండుచరణములు వ్రాఁతపుస్తకములందు లేవు. పూ. ము. లలో 'బదిలంబుచేసి' తర్వాత కనఁబడుచున్నది. 3 ఈ పాఠము పూ. ము. లోనిది (ప. ఓ.)లలో 'భానుగణయుగముపయినవలతిం' అనియున్నది. అర్థము విచార్యము.

పంచపద.

క. ఆది సముద్వృత్తములలో, నైదంఘ్రుల నెద్ది యైన ♦ నార్యులు వలుకన్
బాడుకొని కృతులలోపల, నాదగనునఁ బంచపాది ♦ యనఁగా వలరున్. 287

ఉ. ధన్య సుశీల యన్వనిత ♦ తత్పరత న్నదియోద్ధునందు స
త్కన్యలు సేయునువ్రతము ♦ తానును వేడుక నాచరించి స
న్మాన్యత గట్టినట్టినవ♦మండితతోరము సూయ చేసి పె
న్దైన్యము నొంది కానల వి♦ధాత్ప్రకృతంబున సంచరించు కాం
డిన్యమహామునీశ్వరుఁ గ♦డిందిగఁ బ్రోచినరుక్మిణీశ్వరా. 288

షట్పద.

ప్రాసము లుమ్మాటు ♦ వాసవు లాగ్గురి♦పై సుధా దీధితితో నిర్యతి
భాసిల్లఁగాఁ బాద ♦ మీసూటితో నాల్గుఁ ♦ జేసిన కృతులందు షట్పదాఖ్య. 289

నవవిధరగడలు.

వ. మఱియు వైతాళీయభేదంబు లైనరగడ లనేకంబులు గల వందుఁ బ్రసిద్ధంబులైన హయప్రచారాదినవవిధంబులు ప్రబంధంబుల వర్తిల్లు నవి యెయ్యవి యనిన. 290

క. నరసఖ హయప్రచారము, వరుసఁ దురగవల్గనము వి♦జయమంగళమున్ (?)
ద్విరదగతి విజయభద్ర, మ్మధురహరి హరిణప్లుతగతులు ♦ వొరలుం గృతులన్. 291

క. ఆద్యంతప్రాసంబు ల,భేద్యంబులు రెంట రెంటఁ ♦ బెనిచి పదంబుల్
హృద్యంబులు గూర్చిన నన,వద్యంబులు రగడ లెల్ల ♦ వాలుం గృతులన్. 292

క. కొద లేని నైపుణులఁ జొ,పదచే నుత్సాహవృత్త♦పదయుగ్మముచేఁ
దుద నాదిని ప్రాసంబుల, నదలక విరచింప వలయుఁ ♦ బ్రాజ్ఞులు రగడల్. 293

హయప్రచారము.

ఋతువిరామ ♦ మినులు నల్వ, రతుక నొక్క♦యంఘ్రి చెల్వ
దనర హయతఁ ♦ దార్క్ష్యుఁ డంచు, దనుజహరణ♦దక్షుఁ డంచు
మును శుకాది♦మునులు వొగడ, జను హయప్ర♦చారరగడ. 294

తురగవల్గనము.

ఇరవుల న్హయప్రచార ♦ మినుమడించి కృతులఁ జెప్ప
దురు విదూరితాగ్నివరణ ♦ తురగవల్గనాఖ్య మొప్పు. 295

విజయమంగళము.

తురగవల్గనంబు రెంటి♦తోడ విజయమంగళంబు
ధూర్తకంసకూటదహన ♦ తుహినహీరసదృశకీర్తి

పరఁగ దుగ్ధసింధుమధ్య♦భాసురాంతరీపవ ర్తి
వారివాహసదృశమూర్తి ♦ భక్తజనవ్యాదబ్జపూర్తి. 297

ద్విరదగతి.

కర మొప్పఁ బంచలఘు♦గణచతుష్టయము చే
విరమంబు రెంటిపై ♦ ద్విరదగతి పేరిచే. 298

విజయభద్రము.

ద్విరదగతి రెట్టింప ♦ విజయభద్రము చెల్లు ♦
విదురపూజితపాద ♦ వేదసన్నుతనామ
దరచక్రకార్ముకగ♦దాఖడ్గధారణా ♦
తాపింఛసమగాత్ర ♦ దళితదైత్యస్తోమ. 299

మధురగతి.

[1]నాలుగుమాత్రలు ♦ నాటినగణములు, నాలుగు రెంటికి ♦ నలి విరమణములు
గలనీ మధురగతి♦కనలును జగణము, తోలఁగిన ధృతిశా♦స్తుభ కవిరమణము. 300

హరిగతి.

నలసభగగణములలోపల నేదై♦నను నెనిమిది నాల్గిటిపై విరమము
గలసిన హరిగతి చెలు వగుఁ గృతులం ♦ గవివరులౌ నని చెప్పిననియమము. 301

హరిణగతి.

నరహరి పదియు ♦ నాలుగులములు, కరియతి హరిణ♦గతికి నెళవులు. 302

వృషభగతి.

ఇరువదియెనిమిది లఘువులు [2]పది♦యేనిట విశ్రాంతియుఁ గూర్చిన
నిర వగు వృషగతి పద్మాధిప ♦ యిది విను మాదరము న ముదమున. 303

యక్షగానలక్షణము.

సీ. తుద నేడులఘువులు ♦ తొలఁగించి చదివినఁ ద్రిపుటను వృషభగ♦తిపదయుగము
లలిఁ గడపల నొక్క♦లఘువు మానిన జంపె మనుద్విరదగతిస♦మపదయుగము
గురు తగురచ్చెర♦కుఁ దురగ వల్గనావ్యాయ మేకతాళియా♦మధురగతికి (?)
నంఘ్రి కిర్వదినాలు ♦ గటతాళమున మాత్ర లోలి విశ్రాంతి ప♦ద్నాలుగింటఁ
తే. దెలియ నర్ధంబు నర్ధచం♦ద్రికలు వీన
యక్షగానప్రబంధంబు ♦ లతుక వచ్చు
రగడభేదంబు లివి యుంద్రు ♦ రసఁ గవీంద్రు
లవితనిజసేవకస్తోమ ♦ యద్ధిధామ. 304

---

1 నాలుగులఘువులు (ప). 2 పదిహేనిట (ప).

## ఉదాహరణలక్షణము.

సీ. సప్తవిభక్తులు ♦ సంబోధనంబును గూడ నెన్మి విభ♦క్తులు క్రమమునఁ
బతిపేరు దొరలంగఁ♦బద్య మొక్కటిఁ జెప్పి రగడభేదములు మా♦ర్గములుఁ గాఁగఁ
గళికలు నెనిమిది ♦ దశములు గావించి దానిలో సగము నుత్కళికఁ జేసి
యది యొక్కసమసనం ♦ బయ్యెడు దశము లెన్మిదిఁ గూర్చి వానికిఁ♦దుద విభక్తి
తే. బయలు పఱచి కట్టకడను♦బద్య మొకటి, పలుక వలయును సార్వవి♦భక్తికముగ
నిర్వదాఱుపద్యములందు ♦ నిడిన ధాత్రి, నిది యుదాహరణ మటందు ♦ రిద్ధచరిత.

సీ. సంబోధనమునకు ♦ సరసాళి జయపతి ప్రథమకు వాణి వి♦రావళియును
క్షితి ద్వితీయకు స్ఫుట ♦ కీర్తిమతియుఁ దృతీయకుఁ గీర్తి సుభగయు ♦ నటఁ జతుర్థి
కిని దేవలాభిని♦యును భోగమాలిని పంచమికి నెసంగు ♦ వాణియును గ
శావతి షష్ఠియు ♦ లలిత కాంతిమతియు సప్తమికిని ఘూర్ణి ♦ సత్కమలయు
తే. వాదిమూర్తులనామధే♦యములు వెనుకఁ, బలికినది వేల్పు లష్టవి♦భక్తులకును
వారుతిమశక్తిశోలఁదిని ♦ వ్రాలుఫలము, లిత్తు నాయకద్వయమున ♦ కిందిరేశ.

సీ. సంబుద్ధి యెడలించి ♦ సప్తవిభక్తులు పలికిన భక్తిస♦ద్దలి యనంగ
సంబుద్ధితోఁ గూడ ♦ సప్తవిభక్తులు పలుక నొప్పారు బ♦ద్ధలి యనంగ
సంబుద్ధితోడ వి♦షమవిభక్తులతోడఁ బలికినకృతియు వి♦ద్దళి యనంగఁ
గళిక లుత్కళికలు ♦ గమకింపఁ బలికినకావ్యంబు నుత్ఫుల్ల♦కంబనంగ
తే. నవనిఁ జాటుప్రబంధంబు♦లందు మిగుల, నాటకోనియొప్పుచుండుని♦నాల్గు దెగలుఁ
గానఁబడు నుదాహరణము ♦ ల్గానలోల, కామెపల్లీశ పల్లవీ♦కాముకృష్ణ. 307

ఉ. శ్రీవనితాసనాథుఁడు వ♦శీకృతభక్తమనోంబుజాండు వి
శ్వావనుఁ డుగ్రసేనుఁ డురు♦శైద్యుఁ డజేయుఁ డగణ్యసద్గుణ
ప్రావృతభూషణోజ్జ్వలుఁ డ♦హీనపతికోటిమరీచి భద్రదం
తావళినాయకావనుఁ డు♦దారుఁడు కృష్ణుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 308

### కళిక.

మఱియును దేవకికొరసేనిక♦మారనిర్మలరత్నరాజము
కలుకుటసురల నెల్లఁ దారుణ♦కదనధారుణి దునుము తేజము
బలిమి నందనవనములోపలి♦పారిజాతము ధరకుఁ దెచ్చెను
గొలఁది మీఱినసమ్మదంబునఁ ♦ గుండలంబులు తల్లి కిచ్చెను
జెలఁగి నరునకు సూతకృత్యము ♦ చేసి కౌరవులఁ బరిమార్చెను
దలఁపు వ ఱుపనిదానవయములఁ ♦ దవిలి తిరుగనిముక్తిఁ జేర్చెను

వెలఁదికోలకును బాణుచేతులు ♦ వేయు నఱికినవిక్రమోగ్రుఁడు
జలదములఁజిగి దెగడునొడలున ♦ జానుమీఱెడుశుభసమగ్రుఁడు. 309

ఉత్కళిక.

కమలనేత్రు విరాక రోయుచు ♦ యమునయొడ్డునఁ దపముసేయుచు
నున్న కాంతను జూచి రయమున ♦ నున్నసుద్ది వచించి ప్రియమున
నరుఁడు గూర్చినమిత్రు నానతి ♦ కరము పట్టెడుదానిఁ దానతి
విదళితాసురసార్వభౌముఁడు ♦ యదుకులాంబుధిపూర్ణ సోముఁడు. 310

ఉ. మానవులార రోగములు ♦ మానును లేములు లేవు సంపదల్
జా నగు దుఃఖము ల్దొలఁగు ♦ జాలు నఘంబులు మందబుద్ధులై
దీనత నొంద నేటికి న♦తిస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులుగాక మీరు వసు♦దేవకుమారకు ముక్తికోసమై. 311

కళిక.

[1]మఱియు ప్రేతల నెల్ల ♦ మరులుకొల్పినవాని
మెఱసి కానను బసుల ♦ మేపి తిరిగెడువాని
భామతో దూర్వాసు♦బండియీడ్చినవాని
వేమఱదిరినమగధు ♦ విరగఁ దోచినవాని
బాలుఁడై ట్రోలెక్క ♦ పాలుద్రావినవాని
హేలతోఁ బదిరూపు ♦ లెలమిఁ దాల్చినవానిఁ
దాళవృక్షము లెల్ల ♦ ధరణిఁ గూల్చినవాని
గాలిరక్కసుఁ జావఁ ♦ గాలఁ దన్నినవాని
లీలఁ గొల్లను గడిఁది ♦ లేమిఁబాపెడివాని. 312

ఉత్కళిక.

మందుపావకుఁ గోల్చి ♦ కొండవాహుతి వ్రేల్చి
పార్థివేశ్వరుఁ గాంచి ♦ పార్థు నక్కడ నుంచి
దారకుం డమరించి ♦ చేరఁ దెచ్చినమంచి
యరద మె*క్కక పూని ♦ పురికి వచ్చినవాని. 313

---

1 ఇందు రెండవచరణము మొదలుకొని అయిదుపాదములు పూ. ము. లలో లేవు. (ప. ఓ.)లలోఁగలవు.(పూ.ము) లలో ఇందలి 1-7-8 పాదములును (ప. ఓ.) లలో లేని 'లీలఁగొల్లను గడిఁదిలేమిఁబాపెడివాని' అనుపాదమును ఇట్లు నాలుగుపదములు మాత్రమే కలవు. * 'కొను' కుక.

చ. [1]పులకిల నేల మానవుల ♦ [2]పుట్టును పావన మయ్యె నెప్పుడున్
[3]గళవడ మేల రోగము ల ♦ కాలగతిం గడపట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యథలు ♦ దవ్వులకేఁగును వాంఛితార్థముల్
గలుగు నమేయుచేతఁ గమ ♦ లాధవుచే వటపత్రశాయిచేన్. 314

కళిక.

మఱియు బ్రహ్మమాయఁ గెల్చి ♦ మసలుమంత్రవాదిచేత
నెఱిఁగి సౌంభకునకు వరము ♦ లిచ్చి మెఱయుమోదిచేత
మృతతనయుని మరల గురున ♦ కిచ్చినట్టియమృతుచేత
నతులరాసకేళి సలిపి ♦ నట్టియాదినటునిచేతఁ
బిండి రుబ్బునాతిమోము ♦ పెరుగు దుడుచుకొంటెచేత
మండుచున్న కారుచిచ్చు ♦ మరిగి త్రావునమరుచేత
నెలుఁగుతోడఁ బోరి మణియు ♦ నింతిఁ గొనినయజరుచేతఁ
వెలయఁ దులసిపూసపేరు ♦ వేసికొనినజోగిచేత. 315

ఉత్కళిక.

గట్టిగి శరపంజరంబు ♦ గట్టఁ దలఁచి వేగిరంబు
చవుటికడలిచెంతఁ జేరి ♦ పవనతనయుతోడఁ బోరి
తన్నుఁ జీరినంత వచ్చి ♦ చెన్ను గెలుపు నరున కిచ్చి
మహిమ మెఱయుకృష్ణుచేత ♦ మిహిరకోటిదీప్తుచేత. 316

శా. ఓలం బాసకుఁ దేక మత్సరముతో ♦ నుప్పొంగి పెక్కండ్రులా
భీలాకారమునం గొలంకు[4]నడుమన్ ♦ బేటాడునక్రంబుతోఁ
జాలం గయ్యము చేసి చిక్కినసుద ♦ స్తంబేరమస్వామికై
కేలం బట్టి నిమిర్చినట్టిహరికై ♦ కృష్ణాంబుభృన్మూర్తికై. 317

కళిక.

మఱియునుఁ గౌమోదకియును ఖడ్గము ♦ మణియును శంఖముఁ బట్టినహరికై
మెఱయఁగ విస్ఫుచ్ఛలముఁ దాల్చక ♦ మెలఁగెడుదధికణపరిదిగ్ధునకై
వెలుచం గదిసిన[5]మల్లుల నిరువురఁ ♦ బిడికిటఁ బొడిచినబలుమల్లునకై
వెలయఁగ యమునానదిలోఁ గాళియ ♦ విషధరుఁ దోలినయదుసింహునకై
విజయునిరథసారథియై గురునృప ♦ భీష్మాదులఁ గెలిచినభూపతికై

1 పులసిల (ఓ. పూ. ము). 2 పుట్టువు (ఓ. పూ. ము). 3 గళనళమేల (పూ. ము). 4 వడుమన్నిట్టాడు (పూ. ము); బేపాడు (ఓ.). 5 మల్లుర (పూ. ము).

గజగా యువనాభిధు ముచుకుందునిఁ • గనుదృష్టినిఁ జంపిన శ్రీపతికిన్
బలువిడి దేవకితండ్రిని మధురకుఁ • బట్టము గట్టినగోవిందునకున్
గెల దాల్చినవైఖరి గోవర్ధన•గిరి మోఁచినమహానందునకున్. 318

ఉత్కళిక.

తొలిపుట్టువునోము[1]ఫలంబున నే, బలువిడి నగుపేదతికంబున నే
సరి కొండల మందుచుఁ బైనంబై, పురికిం బరమానందమునం బై
కొని యుబ్బుచు వచ్చి కలిమిపనికిం, గని యాదుకు లొసంగినబాపనికి
న్గలి మిచ్చినబాలస్నేహునకున్, కలుములచే నేలినకృష్ణునకున్. 319

మ. పురిటింటం బసిబిడ్డచందమున నాఁ•పోనంగ నాఁ డాత్మలో
మురు వొప్ప న్విషదుగ్ధయుగ్మస్తనయై • ముద్దాడు రాకాస్యెచ
న్నిరుకేలంగొని బాలు ద్రావుమిపచే • నిస్సైనకాలంబునన్
ధరణిం గూల్చిననందపుత్త్రువలనం • దార్కాణధర్మస్థితుల్. 320

కళిక.

మఱియు గీతామృతస•మగ్రసింధునివలన, నఱలు భవపటలితిమిర•వనజబంధునివలన
బొంకు లెయ్యెడ లేని•భూరిసత్త్యునివలన, జంకు లెన్నఁడు లేని•సమరనిత్త్యునివలన
ఖేదము ల్బెడబాపు•[2]కేశిమర్దనునివలన, నాదికారణమూర్తి • యగుజనార్దనువలనఁ
గాన రానిపదములఁ•గాను పానుపువలనఁ,[3]బూని గొడ్రాలికిం • బుట్టు కొనుపువలన.

ఉత్కళిక.

[4]తను బిల్వ మిగుల గూర • దిని పాక మింపారఁ
జెని ద్రౌపదిచేత • నాసు దీరఁగ మేఁత
యడిగినమునీశులకు • నిడఁ గల్గు దాసులకుఁ
గల్పించుమహారవలనఁ • గల్పస్థాయివలన. 322

1 ఫలంబున నే-పూ. ము. అంత్యప్రాసనియమభంగము. 2 కేళి (పూ. ము.). 3 పూనిగొడ్రాలికిఁ బుట్టు కొనుపువలన (పూ. ము.) ఛందోభంగము; బూని గొడ్డురాలికి (ఓ.ప). 4 తనుఁ బిల్వ మిగుల-పూ. ము. ఈ చరణమున 21 మాత్రలున్నవి.

§ గుర్తిటఁ గిష్టంబుగ...... నిర్వైన కాలంబునన్—పూ. ము. ఇది "త్వర్థకారసంధి" ఇది యప్పకవి యుపయోగించి యుండడు. కావున దీనిని సవరించుటన్యాయ్యము. మహాలాక్షణికుఁ డైనయప్పకవియె యిట్టిదానా ప్త్రియమైన సంధిని జేసినచో నాంధ్రభాషకు మాప్పునచ్చునను టయతిశయోక్తి గాదు. మరియు "నిర్వైన" అను పదము మిక్కిలి కర్ణకఠోరముగ నున్నది. తక్కినపద్యశైలిని చూడగా పదముల మార్దవము స్పష్టముగదా.

శా. [1]కారాగారమునందు వెల్వడి భుజా•గస్వామి సుచ్ఛత్రమై
పైరాఁ దార్క్ష్యుఁడు వాకిట [2]న్దైలివ•స్త్రస్తోమముల్ పూటి శ్రీ
పూర్ణోద్భాతి పథంబొసంగఁ దనుఁ గొం•చుం దండ్రి యేతెంచి [3]చా
ల్వారేపల్లెను నిల్పఁ బోల్చి[4]హారికి • న్వాలాగ నేమ్రొక్కెదన్. 323

కళిక.

మఱియుఁ దెలియ నెఱయ నుఱియు•మఘునిఁ గూల్చినట్టిహరికి
నఱిమి తఱిమి చఱిమి సుఱుము•నస్త్రుఁ గెల్చినవితకరికిఁ
గఱచి చఱచి యుఱచి పఱచుఁ•గపినిఁ జంపినచ్యుతునకు
మఱిగి తిరిగి విఱిగి [5]సొరగు•మద్దులీడ్చినయమితునకు
[6]సరలి కెరలి వరలి మరలి • సాల్వుఁ జంపినక్షరునకు
గరిమ మెరిమె యొరిమి నెరిమి • కామెపల్లిమందిరునకు
నయముఁ బ్రియము రయము జయము • నరుని కిడినకేశవునకు
వ్యయము భయము లయము క్షయము • వైరి కొసఁగుమాధవునకు. 324

ఉత్కళిక.

[7]గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ • బెల్లుజల్లు లల్లి రాళ్ల
సోనవాన మాన పూని • కొన రాని[8]కోనలోన
చుట్టి పట్టి గట్టి దిట్టఁ • బొట్టు గట్టు మట్టు గుట్టు
నూఁచి లోఁచి నోచి మోఁచి • [9]బ్రోచినట్టివామనునకు. 325

మ. పృథులావంతివరస్వయంవరమున • న్విందానువిందామలక్ష్మా
ప్రథనక్షోణిని గెల్చి సద్గుణ సుభ•ద్రన్ మిత్రవిందన్ గొకొంచు వ
చ్చి ధరాధీశునమజ్ఞ చే ననలసా•క్షీకంబు గృహ్యోక్తస
ద్విధిఁ బెండ్లాడినకృష్ణునందు నిలిచె • [10]స్థిరప్రతాపోన్నతుల్. 326

కళిక.

మఱియు నుగ్రసేనా•మాత్యునందు, నెఱి మీఱ లయకాల•నిత్యునందు
విబుధార్చితపదార•విందునందు, విదళితఘోరారి•బృందునందు

---

1 కారాగారమునుండి. పూ. ము. 2 ద్దెలియ (ప). 3 చెల్వారంబల్లెను. (పూ. ము). 4 హారికీవాగార (ప). 5 యొరగు (పూ. ము.). 6 సరలిమరలి కెరలివరలి సాల్వుఁ జదిపినక్షరునకు (ప. ఓ.). 7 ఇందు (పూ. ము) లలోను (ప.) లోను మూఁడు చరణములు మాత్రమేయున్నవి; (ఓ.)లో నాల్గుచరణములున్నవి. 8 కొన-పూ. ము 9 ద్రోచినట్టి వామనునకు (పూ. ము); బ్రోచినట్టి వామనునకు (ప) 10 దీర్ఘ (పూ. ము).

నాభీరువస్త్రాప♦హారునందు, బలిపట్టణద్వార♦ పాలునందు
జలగాదిదశతనూ♦చ్ఛాదునందు......... 327

ఉత్కలిక.

సజ్జరాగంబు, రజ్జునాగంబు, కంధియోగంబు, మందరాగంబు
రాపుతో నూచి, వీఁపుతో మోఁచి, వెలయుహరియందు, జలజాక్షునందు. 328

ఉ. ధర్మజుఁ డంపినం జరిగి ♦ దంతిపురంబున నాంబికేయుతో
ధర్మముఁ జెప్పి దుష్కృతుల ♦ [1]దగ్గఱ శాంతనవాదిసజ్జనుల్
నిర్మలచిత్తు లెల్లఁ గను♦నేరుపున న్సభఁ దాల్చినట్టిని
న్నర్మవచోకృతిం దలఁతు ♦ నాదుమనంబున నందనందనా. 329

కళిక.

మఱియుఁ జగన్మోహన♦మాయఁ దాల్చినజాల, జిఱుతతఱి ద్రౌపదికిఁ♦జీరలిచ్చినకాల
సఖులతో నదిలోనఁ♦జల్లి గుడిచినబాల, విభవసుం డెదలోన ♦ వేఁ దలిర్చినలోల
నరుతేరినాగలపై ♦ నాట్యమాడినవీర, సరకుగొని భీష్ముపైఁ ♦ జక్ర మెత్తినశూర
తరిని సద్గురుసుతుల♦దాపరించినసదయ, పెరిమె నాగపురంబు♦పెక్కలించినవిజయ.

ఉత్కలిక.

గురుభీష్మ రాధేయు ♦ లురుజన్యమున నేయు
శరవహ్ని బయ లెక్క ♦ యరద మెల్లను సెక్క
[2]తరి గొల్చునెడ పాండు♦వరుల నేగురి మెండు
బ్రతుకఁ జేసినపుణ్య♦వితత దీనశరణ్య. 331

శా. నీ వొక్కండవు నిన్ను నమ్మి కొలుతు ♦ న్నీచే సుఖం బబ్బె నీ
కై వే దండ మొనర్తు నీవలన ని♦ష్టావాప్తి చేకూఱె నీ
కే విశ్వాసముఁ [3]జేర్చి తింక మదిలో ♦ హెచ్చయ్యె నీయందు నా
కైవారంబులు శౌరసేనతనయా ♦ కామేపలీవల్లభా. 332

ఉ. నామన విచ్చగింపు మిట ♦ నన్నయభట్టకృతాంధ్రశబ్దచిం
తామణికల్పనోక్తికల♦నాచతురోపమ లుల్లసిల్ల ని
చ్ఛామతి నర్పణంబుగ నొ♦సంగితిఁ గామెపలీశ నీకు నై
రామయమై తగ న్భవము♦దాహరణంబు జగత్ప్రసిద్ధి గాన్. 333

1 దగ్గఱ (పూ. ము.) యతిభంగము. 2 తరుగాల్చునెడ పాండుతనయులేగురి మెండు(పూ.ము); తరిగొల్చు(ఓ.); తరుగొల్చు(ప.); మఱికొన్ని తాటాకుపుస్తకములు చూచినగాని సరియైనపాఠమునిర్ణయించుటకు సాధ్యముగాదు. 3 జేస్తునింక(పూ.ము.).

వ. సీసంబు లనునవి సమవిషమంబుల రెండుదెఱంగు లయ్యె వానివిశేషంబు లెట్టివనిన.

సీసమాలిక.

యతి నైనఁ బ్రాసంబు • నందైన [1]నొకటితోఁ జెప్పిరేనియు సమ•సీస మగును
నియమము ల్దీనిపై • నిలిపిన సీసంబు లాఱుదెఱంగు లై • యతిశయిల్లు
నెనిమిదంఘ్రులఁ బ్రాస • మెక్కింప వళ్లకై సర్వతః ప్రాససీ•సం బనంగఁ
బ్రాస మాఱంఘ్రులఁ • బదిలంబు గావింప నక్కలిప్రాససీ•సాఖ్య మనఁగ
నాది నేవడి నిల్పి • రావడే పద మెల్లఁ జేయ నవ్యాది వడి•సీస మనఁగఁ
బదఖండములయందుఁ • బ్రత్యేకయతులుగా స్థిర వనకలివడి•సీస మనఁగఁ
గుదురుగా నుత్సాహ • తుదయందు గీతంబు చెప్పిన విషమాఖ్య•సీస మనఁగఁ
గడ వెళ్ల లఘువులే • కల్పించి రెద్దాన సరవి సర్వలఘుసీ•సంబు ననఁగఁ

తే. సప్తవిధము లివియ శబ్ద•శాసనుండు, పంచమామ్నాయపంక్తులోఁ • బల్కెఁగాని
కడమకవు లాఱుసీసము • ల్విడిచిపెట్టి, చెలఁగి సమసీసపద్యమే • చెప్పినారు. 335

అందు సీసలక్షణం బెట్టి దనిన:—

క. సురపతు లాఱ్గురిపై భా, స్కరు లిరువురు గూడ నొక్క•చరణము పొల్పొం
బరఁగు నవి నాలుగడుగుల, విరమముపై రెంట రెంట • వెలయఁగ వలయున్. 336

క. వానిఁ జరణములు నాలుగు, చేసి తుదిని గీత మొకటి • చెప్పఁగ నయ్యెన్
సీసము తంగెడదేశవి, భాసురశుభఖేల కామ•పాలిగోపాలా. 337

సమసీసము.

బ్రతికించె నెవ్వాఁడు • మృతగురుతనయుని మెలఁత వేఁడిన మెచ్చి • మేలు చేసెఁ
బోషించె నెవ్వాఁడు • పొదివినదారుణాపద లెల్లఁ దొలఁగించి • పాండుసుతుల
వెడలించె నెవ్వాఁడు • వెడపొడు బావిలో నూసరవెల్లి యై • యున్ననృగుని
మర్దించె నెవ్వాఁడు • మౌసలంబున వృష్ణియదుభోజసైన్యాంధ•కాదినృపుల

తే. ప్రేల్చె నెవ్వాఁడు ఖాండవ•విపిన మెల్ల, జాతవేదోత్థవిలసిత•జ్వాలమీఁద
నతనిఁ గీర్తింతు మదిలోన • ననుదినంబు, ననఁగ నలరారు సమసీస•మఖిలకృతుల.

సర్వతః ప్రాససీసము.

వేదండవరదుండు • వేధోండగాంగుండు కాదేవశయనుండు • యాదవేంద్రుఁ
డాదిత్యవంద్యుండు • నాదాసులభుండు వేదాంతవేద్యుండు • కాదఖిలుఁ
డాదితేయుఁడు బిందు•నాదకళాతీతుఁ డాదిత్యకులజుండు • బాధితారి
మేదిశ్రీశుండు • భూధరగాత్రుండు శ్రీదమిత్రసఖుండు • ద్వాదశాత్ముఁ

1 రెంటితో (పూ. ము.).

తే. డాదిదేవుఁ డాశ్రితగంధ•మాదనుండు, చేదిసాంభక వైదర్భ•సూదనుండు
మేదురమురళీనాదవి•నోదుఁ డనుచుఁ, జెప్పినను సర్వతః ప్రాస•సీస మగును. 839

### [1]వృత్తప్రాససీసము.

శిక్షించె నెవ్వాఁడు • [2]చేటుకై సభలోనఁ జెడుమాట లాడిన • చేదివిభుని
రక్షించె నెవ్వాఁడు • ద్రోణిబాణము చేతఁ [3]జెదియకుండఁగఁ బరి•క్షిన్నృపాలు
భక్షించె నెవ్వాఁడు • పర్వతాకృతిచేత నాభీరు లర్పించు • నారగింపు
వీక్షించె నెవ్వాఁడు • వేడ్కతో సేవకుల్ బ్రతుకునట్లుగఁ గృపా•పాంగదృష్టి
తే. దాక్షిణాత్యుని సాంభక•ధారుణీశుఁ, జంపె నెవ్వాఁడు పోరిలో • సాహసమునఁ
బక్షిరాజతురంగుఁ డే•వ్వాఁ డనంగఁ, జెలఁగుచుండు వృత్తప్రాస•సీసము లిల. 840

### పడిసీసము.

విజయసారథిఁ గాని•వినుతింపఁగా నొల్లఁ గిరినాయకునిఁ గాని • కీర్తిసేయ
యాదవేంద్రునిఁ గాని•యభినుతింపఁగ నొల్ల మధుసూదనునిఁ గాని • మదిని నిల్పఁ
బద్మనాభునిఁ గాని • ప్రణుతింపఁగా నొల్లఁ జక్రపాణిఁ గాని • ప్రస్తుతింప
బాణసంహారుఁ గాని • భజియింపఁగా నొల్లఁ బీతాంబరునిఁ గాని • ప్రీతిఁ దలఁప
తే. నవితవేదండపతిఁ గాని • యనుసరింప, ననుచు నిన్నుఁ గూర్చి యనురక్తి•నాత్మ నెప్పుడు
పొగడుసత్కవి[4]వ్రజములఁ • బ్రోచి తనరఁగఁ, దనరు పడిసీసభేదంబు • తాళభేది.

### అపకలిపడిసీసము.

సామాజికాహిత•స్తోమంబు సామంబుగా మించి మైత్రికి • నామతింప
నభిమానధారుణీ•విభులు దానంబుచే నక్కఱ లన్నియుఁ • జక్కఁ జేయ
నతిరుక్మపక్షమా•నతులు భేదంబుచే దినదినక్షీణత్వ•మునకుఁ జెడఁగఁ
బదిలింపుటుద్దండు • లాఁడిగ దండంబుచేఁ దనయాజ్ఞ యాదల • నునిచి నడువ
తే. సంధియానాదిషాడ్గుణ్య•బంధురముగ, [5]నోమి శక్తిత్రయో•పేతుఁ • డై మురారి
నేల ననురక్తి నీతిలో • నేలె ననుచుఁ, జేయ నపకలిపడినామ•సీస మగును. 842

### విషమసీసము.

అంచితముగ భీమునకు స•హాయ మేగు దెంచి తా
నించు కెదిరి దురముసేయు • నేయునంకుశంబు తా
కించుకొనక కినుకవలనఁ • గెరలి నరకపుత్త్రి మ
ర్దించినట్టిసవ్యసాచి • తేరిఘోటకావలిం

---

1 దీనికే (వృ. ము.) లో అక్కిలిప్రాససీసమని పేరు. 2 చేట్కుర్యో (ప).
3 చెక్కుకుండఁగ (వృ. ము). 4 ఇనముల (ప). 5 నొర (వృ. ము).

ఆ. దోలుకృష్ణ యంచుఁ♦దోరంపుటుత్సాహ, మీఁద గీత మొకఁడు ♦ మేలదింప
విషమసీస మనఁగ ♦ వెలయుఁ గామెపల్లీశ, జమ్మిచెంత నున్న♦చతురవచన. 843

## * సర్వలఘుసీసము.

క. క్షమ షట్త్రింశల్లఘువులు, త్రిమహేశవిరామము గల♦దీర్ఘపదచతు
ష్కముపై నొకగీతి మురప్రమథన సర్వలఘుసీస♦పద్యమున కగున్. 844

సీ. చిఱుతయగు కొడుకున [1]కే♦దరయి మృతికి మొదలగు
[2]టౌరులవలన విని రుష♦[3]వరుషుఁ డగుచు
చరమశరధిజలముల ♦ తరణి మునుగక మును
దురమున నురువడి బలు ♦ దురుసుపరచి
కెరలి గొనయము దురిమి ♦ మురిగుణము మొరయిడఁగ
నిరికిన శితశరములు ♦ పరువ విడువ
జరిగి నెళవెతిఁ గొదిగి ♦ మఱుఁగున నిలిచిన కురు
పతిమఱఁదిని నెరి నురు ♦ మగను దలఁచి

తే. చేసినట్టిప్రతిజ్ఞ శా♦సింపఁగోరి, సవ్యసాచిశతాంగంబు ♦ సైంధవములఁ
దోలుగోవిందునుతులచేఁ ♦ దొడరుఁగృతుల, సర్వలఘుసీసపద్యంబు♦సాగుచుండు.

క. బలసోదరగీత్యుదితా,ర్యలు నా ర్గార్యాఖ్యగీతు ♦ లాటవెలఁది తే
టులు రెండు సమము లెత్తుక, మలహావ్వయ పవడలు విష♦మంబులు మూఁడున్.

## సమగీతి.

క్షమఁ బథ్యాకందముచం,దమునన్ రెండరలు దెలియఁ ♦ దనరింపన్
సమ మనుగీతికృతులలోఁ, గమలాహృదయాబ్జవాస ♦ కమలాక్షా. 847

---

* కరివరద పరమకృప ♦ ధరణిధగ సురవినుత కనకవసన వరహరి♦గరుడగమన
నళినకరపదనయన♦దళితఖరదనుజలయ నరసఖ పరగుణనిధి ♦ శరధిశయన
పరమపదనిలయ హరి♦పరమపురుష ప్రకృతికిఁ బరుఁడని నినునిగమని♦వహములుకు
నిరతమును హృదయమున♦నినుఁ దలఁతునను మనుపు మనియనఘచరిత జల♦దనిభత

తే. సర్వలఘుసీస మీరీతి ♦ సకలసుకవి,వరులు చెప్పుదు రిలమీఁద♦వరుస నెల్ల [నువ
వారు మెచ్చంగ సర్వేశ ♦ వారిజాక్ష, కామెపల్లీశ యచ్యుత ♦ రామజనక. 845

ఈపద్యము (పూ. ము.)లో నున్నది. 1 కెగరయి(ప). 2 ఊరుల(ప). 3 వరు
షుఁ డెనచు (ఓ).

ఉద్గీతి.

మొదలిసగము చపలగతిం, దుద న్సగము పథ్యగతిని ♦ దొడరంగా
నిది యుద్గీతి యనం దగు, విదురాక్రూరాదివరద ♦ వేణుధరా. 348

ఉపగీతి.

ధరఁ జపలాకందముపై, ఖరి న్సగం బైనఁ ♦ గావ్యములక
బరఁగు నుపగీతి పూర్వా, పర వ్రజతమిస్ర ♦ మార్తాండా. 349

ఆర్యాగీతి.

సముదీరితపథ్యాకం, దముకన్నను నొక్కగురువు ♦ దాకించినచో
క్షమ నార్యాగీతి యగు, న్గమలాప్రాణేశ సహజ♦కంధం బదియే. 340

సమగీతులందు నాటవెలఁది.

మేలు మే లటంచు ♦ మిత్రులు ముగ్గురు, వింత వింత యనుచు ♦ విబుధు లిద్ద
ఱహహ యనుచు నూరు♦లయిదుగురును మెచ్చ, నాటవెలఁది మాఁట♦నలరు సగము.

తేటగీతి.

మిత్రుఁ డొక్కఁడు వీణియ♦మీటుచుండ, విబుధవరు లిద్ద ఱర్థంబు♦విప్పి చెప్ప
నినులు నిద్దఱు వినుచుండ♦నేకగతిని, దేటగీతంబు మాఁటను ♦ వాట మయ్యె. 352

విషమగీతులందు నెత్తుగీతి.

సురనాథుమీఁద♦నూరు లిరువురు రెంట విరతి
ధరణిఁ బ్రాసంబు ♦ [1]దనరు హరి యెత్తుగీతియందు. 353

కమలనగీతి.

హగణ మైనఁ జాలు నగణ♦మైనఁ జాలు హగణ
నగణములును రెండు గలసి ♦ నాటి యంఘ్రి కేడు
తగినవిరతి నాలుగింటఁ ♦ దనరఁ బ్రాస మొదవి
మిగుల మెఱయుచుండుఁ ♦ గృతులఁ గమలనాఖ్యగీతి. 354

పవడగీతి.

అవని ముగురుభాను ♦ లాదిత్యపతు లిద్ద, ఱవల నేగు రర్క ♦ లర్థమునకుఁ
బవడగీతియందుఁ ♦ బ్రాసముల్ సమమూఱు, నవియె యాటవెలఁది♦యందు లేవు.

వ. ఇది నవగీతివివేకం బింక బిరుదావళిలక్షణం బెఱింగించెద. 356

తే. క్షితి మహారాష్ట్రభాషచేఁ♦జెప్పఁబడెడు, ధీకరోక్తులు బిరుదు లై♦పెక్కు దనరు
[2]వాటబిరుదావళియొనర్ప♦నలయునందు, బుధులు సంబుద్ధిపదములు♦పొసఁగఁగూర్చి.

1 దనరు నెత్తుగీతియందు-(పూ. ము) ఛందోభంగము. 2 వాని (పూ. ము). 'వాట' అని వ్రాఁతప్రతులలో నిపాఠము తప్పని దిద్దినయెడల 'వాన' అనియుండవలెను.

చ. అతిభుజవిక్రమోద్భవము • లై రిపుకర్ణకఠోరకంబు లై
[1]యతులితవీరవాక్యము లయి • యాదిమపార్థివలాంఛనంబు లై
ప్రతిపదనూతనంబు లయి • భానిలునూక్తులు గూర్చి స్వస్తివా
క్యతతులఁ జెప్ప నొప్పు బిరు•దావళి సార్వవిభక్తికంబుగాన్. 358

చ. సలలితవాక్యగుంభనల • సర్వవిభక్తుల [2]దీపనంబులన్
జెలు వగుపద్య మొక్కటి ర•చించినపిమ్మట గౌడరీతి సం
కలితచతుష్కషట్కదళ•గద్యము లెన్మిదియుం బదాలు నిం
పలరఁగఁ గూర్చి పేర్చి బిరు•దావళిఁ జెప్పఁగ నొప్పు నెంతయున్. 359

చక్రవాళము.

క. ఒకపద్యముపిదప దళా, ష్టకసందర్భాష్టగద్య • చతురం బగుచు
క్కకిఁ బేరు చక్రవాళం, బకట చతుర్భద్ర మదియె • యచ్యుత మఱియున్.

క. తొలిసమసనాంత్యవర్ణయు,గళ మే పునరుక్తిఁ గాఁగఁ • గైకొని సామి
ప్యలసత్సమాసము మొదల, నలరించినఁ జక్రవాళ • మగు దాశార్హా. 361

తే. అవధరింపుము దేవ ది•వ్యప్రభావ, భావనాతీత నిస్తుల•[3]పరమపూత
పూతనాజైత్ర సుత్రామ•పుత్త్రమిత్ర, మిత్రశశినేత్ర నిర్జర•స్తోత్రపాత్ర. 362

చిత్రకవిత్వము.

సీ. అనులోమమును విలోమ•ము నిరోష్ఠ్యమును దల, కట్టును గుడులు శృం•గములు నక్ష
రవిలోపమును బద•భ్రమకంబు పద్యార్ధ, మకమును నల్లెంట్లు • మఱియు నేక
పదియు ద్విపదియుఁ ద్రి•పదియును నేకవ,ర్ణంబును ద్వ్యక్షరి • త్ర్యక్షరియును
సరవి నిచ్ఛావాక్య•సంఘట్టనంబును, నాదిగాఁ గొన్ని ప•ద్యంబు లెల్ల

తే. క్షితిని జిత్రకవిత్వప్ర•సిద్ధనామ, ధేయములచేతఁ బెంపొంది • తెలివి మీఱు
[4]వానిఁ దెలియఁగ వచియింతు • వాసుదేవ, నందగోపాంగనాపుత్త్ర•నరకజైత్ర.

అనులోమము.

క. దామోదరసామతనధ, రామాసరసాకరదళ•రథహారిరాధా
కామా సదయాతిపరమ, ధామా వరయాదవకుల•దారకరాసా. 364

విలోమము.

సారాకరదాలకువద, యారవమాధామరపతి•యాదసమాకా
ధారారిహాథరళదరక, సారసమారాధనతమ•సారదమోదా. 365

---

1 యతులసిరుద్ధ (ప.ప.). 2 దీపనోక్తులన్ (ప.ప.). 3 పరమమూర్తి-(పూ.ము) ప్రకరుక్తి నయమనిఁ గాను. 4 వాఁటి యని తాటాకుపుస్తకములన్నిటను గలదు.

### నిరోష్ఠ్యము.

క. పావన పాఫాబాభా, మానా యనునాఱులిపులు ♦ మఱి పద్యములో
భావింప దొరల కుండిన, భూవలయమున న్నిరోష్ఠ్య♦ము పిసాళించున్. 366

క. నరహర్యచ్యుత దయాకర, కరిరక్షణ చక్రహస్త ♦ కాంచనచేలా
గరుడతురంగ జనార్దన, ఖరదైత్యనికృంతన హరి ♦ కంజదళాక్షా. 367

### తలకట్లు.

క. హర కలశజ తపన పవన, శరభంగ పతంగ దక్ష ♦ సత్యావాసా
స్మరపదయుగ గరుడధ్వజ, ధరధర సుస్మర యను మనఁగఁ ♦ దలకట్టులగున్. 368

### గుడులు.

క. విరివిని నిలిచిరి విని చిక్కిరి దివి నిశిఁ దిరిగిరి తిరి♦గి మిడికి భీతి
ల్లిరి చింతిల్లిరి తివిరిరి, సిరికొఱకు ధనాఢ్యు లనఁగ ♦ క్షితి గుడుసు లగున్. 369

### కొమ్ములు.

క. గురుఁడును శుక్రుఁడు నుగ్రుఁడు
పురుహూతుండును శుకుండు ♦ బుధుఁడును గుహుఁడున్
బురుకుత్సుండును గుత్సుఁడు
గురునుతు లొనరించి రనఁగఁ ♦ గొమ్ములు కృష్ణా. 370

### అక్షరవిలోపము.

క. రవికన్యాసుందరకర, మవలంబన మోర్చి యుండె ♦ నచ్యుతుఁ డని యే
నవవర్ణవిలోపముగా, నవనిం బఠియింప నలయు ♦ నార్యులు నలరన్. 371

### పదభ్రమకము.

క. ధీరానానారాధీ, ధారాకరతాతరళిత ♦ తారకరాధా
ధారాసుతతసురాధా, ధారితతరిధావ న్నాఁ బ♦దభ్రమక మగున్. 372

### పద్యభ్రమకము.

క. రాధానాథా తరళిత, సాధకరధతావరసుత♦సరసనిధానా
నాధానిసరసతసురవ, తాధరకధసాతళిరత♦ధానాధారా. 373

### నల్లెంట్లు.

క. నారదమునిశార్దూలము, కూరిమి నజినంబు గప్పు♦కొని వేడుకతో
నారాయణవాసున కనారత మేతెంచు ననఁగ ♦ నల్లెంటు లగున్. 374

### ఏకపాది.

తే. మతివినాయకభరితసం♦స్తుతుఁ డనంగ, మతివినాయకభరితసం♦స్తుతుఁ డనంగ
మతివినాయకభరితసం♦స్తుతుఁ డనంగ, మతివినాయకభరితసం♦స్తుతుఁ డనంగ. 875

### ద్విపద.

తే. సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి ♦ సరసిజాక్ష
భోగిభోగాసనుం డని ♦ [1]పొలుచు టరుదె
సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి ♦ సరసిజాక్ష
భోగిభోగాసనుం డని ♦ పొగడ ద్విపద. 876

### త్రిపద.

తే. దేవమునివంద్య గోవింద ♦ దితిజహరణ
పుండరీకాక్ష యవ్యక్త ♦ పుణ్యపురుష
యమరసన్నుత గోపాల ♦ హరి ముకుంద
దేవ యవ్యక్త హరియు నాఁ ♦ ద్రిపదయయ్యె. 877

### ఏకాక్షరి.

క. నానాననానున్నన, నూననునిన్న నెను నేను♦నున్ననినన్నై
నానినను నానానును, నానూన యనంగ నొంటి♦యక్షర మయ్యెన్. 878

### ద్వ్యక్షరి.

క. మునినామా మమ్మును మన,మున నూనిన నేమమునను ♦ మొనమానను న
మ్మనుమని మననము మన్నన, ననుమానానామునిన [2]య♦న ద్వ్యర్ణమగున్. 879

### త్ర్యక్షరి.

క. మానితమతితో మమతను, నీనామము నేమమునను ♦ నేను మననమునన్
నూనమున మతము మానను, దానకముగఁ దలఁతు ననఁగ ♦ త్ర్యక్షరి యయ్యెన్.

### ఇచ్ఛావాక్యసంఘట్టనము.

క. తోఁటలు లెస్సైన యున్నవి, తాటాదూటములు గావు ♦ తాపసు లుండన్
పేఁటలు దామోదరుచె, ల్లాటలకు స్నేహితులు మధు♦రాపురిచెంతన్. 881

వ. ఈపద్యమునఁ దోఁట తాట పేఁట ఆట యనుమాట లర్థవంతములుగాఁ గూర్చుటం
జేసి దీనిపేరు ఇచ్ఛావాక్యసంఘట్టనము. 882

---

1 పోల్చు (పూ. ము); పొగడు (Ed.). 2 'యనం ద్వ్యర్ణ మ్యమగున్' అని యుండవలెను. యనద్వ్యర్ణ-ఇందు 'న' గురువుకామి గనుక ఛందోభంగము.

## బంధకవిత్వము.

సీ. గోమూత్రికాభద్ర • గుచ్ఛకుండలి నాగ, కంకణమర్దల • ఖడ్గచక్ర
పంకజసర్వతో • భద్రమాలాక్షరీ, ప్రముఖబంధంబు లే • ర్పడఁగఁ జెప్ప
నుత్తము లబ్బంధక • విత్వవిశ్రుతము లై, కవులకుఁ జెవులపం • డువులు సేయఁ
బటుతరప్రౌఢిమఁ • బండితపామర, సాధారణంబుగా • జగతిలోన
తే. రాధికాకేళికాలోల • రమ్యశీల, భూరిగుణసాంద్ర యదుకులాం • భోధిచంద్ర
వల్లవీమానచోర దు • ర్వారశూర, పరమవాచాల రాజగో • పాలబాల. 383

తే. మొనసి రెండుచ్చరేఖల • మూలలందు
వలయు బద్యంబు నాలుగం • ఘ్రులను వ్రాసి
చదివికేనియు సుకవులు • సమ్మదమున
ధాత్రి గోమూత్రికాఖ్యబం • ధంబు దనరు. 384

### గోమూత్రికాబంధము.

మాలిని. కనకనయనవైరీ • కాదపాపారవాహా
ఘనజనయనశౌరీ • వాదవాపారివాహా
ఘనధనదవిధిజ్ఞా • పాదసంభూతగంగా
వినయనరవిధిజ్ఞా • వేదసంభూతగంగా.

క. వితరణశూరదయార్ణవ, ధృతచక్రధరవరసింహా • ధృవశోధిమహా
వితరణధీరనయార్ణవ, జితవక్రపరతరగాహా • శివనిధిప్రహా.



### ఛత్త్రబంధము.

క. పారదమదనకవసుధర
దారద సమసమసవాస•దరమారీచా
చారీమారవరాకా
కారావరదారధసువ•కనదమదరపా.

### గుచ్ఛబంధము.



మాణవకవృత్తము.—
గాదిలితో మాలదిగా, గాదిలకించెక బదిగా
గాదిబకృష్ణం డదిగా, గాదిడవాచా లిదిగా.

## కుండలినాగబంధము.

క. ఇలతోఁ జెనబడిసాలుగు, నిలయంబు అగుఁ బయోధ•నిభనీలాంగా
మెలిగొన్న పాముపలె వెలుఁపలగుఁ దలతోఁ కనాగ•బంధంబునకుఁ.



చ. ద్యుతిధరదేవకీతనయ•తోఁయభవస్తుత భూరమేశ సం
మితగుణపారభూతిదయ•మేయబృహజ్జవపూరుషావన
జితవరకౌపురాతనయ•జేయసువిష్క్రరభారవాహకా
శ్వతపురహాతటీదవ•పావకశ స్తపురాణగోవిదా.

## కంకణబంధము.



నీవేగోపాలం కేశిఘ్నం, గోవృద్ధ్యద్రిధ్రంకంకంభుం
శ్రీదం భూనాథం వీనార్యం, కందాభాసం నిరాగారం.

## మర్దలబంధము.



రాజలు రాజశయానా, లాజలు చక్లినయానక
ప్రాజలు గావకవర్తిశా, రాజలు రాజనవయ్యా.

# చతుర్థాశ్వాసము.

## ఖడ్గబంధము.

**లక్షణము:—**

క. చరణాంత్యవర్ణ మొక్కటి, చరణయుగాద్యంబుజేసి • సరసులు మూన్నా
రిరుగడల మధ్య మొకటిగ, పరుజుల గదియింప • ఖడ్గబంధం బొనరున్.




**లక్ష్యములు:—**

క. శమదమసమధికచిత్తా, విమలాంభోజారిహస్త•విష్టరకర్ణా
యమలార్జునతరుభంజన, కమలాధరణీసనాథ • కంధరవర్ణా.




క. ధనదవనీవనశవత్సన, కనకాంబరవాసుదేవ • కరుణాపాంగా
శనివరద శుభకర దశ,త్సనకశిపు పూర్వదేవ•కందనిభాంగా.



క. శూరవరద రఘువరముర, మారణ చాణూరకంస • మధుపౌండ్రహరా
రారాజత్కనకాంబర, ఘోరగ్రాహారిరక్ష • గోపీజారా.



క. శారదరసారమణదర, పారదరజనీశకీర్తి • పావనచరితా
తారకరిపువినుతహరియ, పారదయార్ణవముకుంద • భావజతాతా.



సుగంధి:—

శౌరితీరి వారిజాక్షు • గోరఁజేరఁజేరవే
వేరుపడ్డదైత్యులొప్పు • వేగిలించి, లెస్సగా
గారవించి యతనిపుత్రు • గాంచి వేడ్కఁ బ్రోవవే
వేరువేర నింగినిల్చి • వేల్పులెల్ల మ్రొక్కఁగన్.

## చక్రబంధము.

లక్షణము:—

సీ. వర్తులాకృతులుగా పదిగీతులు లిఖించి యాతలితరమధ్యమాలయమున
నంటంగఁ గడలెల్ల నారురేఖలు గీచి, క్రిందిపందొమ్మిదో ఛందమునను
బ్రోదిపుట్టినవృత్తమేదైన మూడంఘ్రు లటు వ్రాసి నడిమింటి నాదివర్ణ
మేది యదియేను నది యినుమారు రాఁజెప్పి మూట నారిట నామమాలరచించి
గీ. కడలు గలయంగ నాలవ • కాలువలికి, చక్రబంధస్వరూపంబు • సభ్యులెల్ల
వ్రాయఁదగుఁ గా మెప్పల్లిశ • వారిజాక్షు, జమ్మికడనున్న గోపాల • చారుశీల.

## చక్రబంధము.



**అన్వయము:—**

శా. భద్రాకాముకసోమసూర్యనయనా ♦ భ్రాజిష్ణుకార్యక్రమా
క్షుద్రాక్రుద్ధవిమర్శితాంగనరతా ♦ స్తోకప్రసంపత్కరా
భద్రానూనజయావహావినయవా ♦ గ్భావిస్ఫూర్తాయతక్షమా
మాద్రీశా భవతత్కుకా శుభకరా ♦ మాంగల్యరాసోద్యమా.

## అష్టదళపద్మబంధము.



స్రగ్ధర. రాధాసక్తారసగ్రా • వ్రజకులతిలకా • త్రాతకృత్యాప్రియధేరా
రాధేయత్ప్రాకృతత్రా • ప్రవిమలసుగుణా • గ్రావవర్యాప్రధీరా
రాధీప్రర్యావవగ్రా • ప్రకటదనుజజై • త్రాపదప్రోత్థధూరా
రాధూత్థప్రోదపత్రా • ప్రరుచిరపృథుక • గ్రాసరక్తాసధారా

## సర్వతోభద్రబంధము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వం | దే | స | దా | దా | స | దే | వం |
| దే | వ | రం | వ | వ | రం | వ | దే |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దా | వ | కం | త | త | కం | వ | దా |
| దా | వ | కం | త | త | కం | వ | దా |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దే | వ | రం | వ | వ | రం | వ | దే |
| వం | దే | స | దా | దా | స | దే | వం |

వందేసదా దాసదేవం, దేవరం వవరం వదే
సరంగకంకంగరసం, దావకంతతకం వదా.

## మాలికాబంధము. 1



అనంత నందనందనా సనాతనా జనార్దనా
వనాటరత్నరక్షరమ్యనాగనాధనాశనా.

## మాలికాబంధము. 2



చ. ఖరహర ధీరదేవకవకత్రకటాంబరవీరసారదు
ర్ధరధరవారణేతురవరమ్యరమేశ మహామహామహీ
ధరగరహారసన్నుత కృతజ్ఞశిష్టపరాపరాపరం
శరణ రణోరమావిశద శ్రీమాత్మ శ్రీశశా.

వ. ఇది బంధకవిత్వం బిఁక గర్భకవిత్వంబు వివరించెద. 385

## గర్భకవిత్వము.

సీ. గాంగేయకాశేయ॥ఘనకందగీతసద్గర్భచంపకమాలి॥కయు వరిష్ఠ
కందపద్యద్వయ॥కమలవిలసితరుగ్మవతికాగర్భిత॥క్రౌంచపదము
గీతమత్తేభవి॥క్రీడితాకందగర్భితసీసము నట షడ్వృత్తగర్భి
తోత్పలమాలిక॥యును సుకల్పితకల్పవల్లియు సీసరూ॥పద్విపదయు
స్రగ్విణీగర్భభు॥జంగప్రయాతంబు కందగర్భితమణి॥గణనికరము
[1]కలితచతుర్విధ॥కందపద్యము నష్టవిధకందమును బంచ॥విధసువృత్త
తే. మాదిగాఁ గలకొన్ని ప॥ద్యములు పెక్కు, సరవిఁ బద్యము లిమిడి దో॥షములులేక
కాన వచ్చిన నవి యెల్ల ॥ గర్భకవిత, ధరణి నొప్పారు[2]నరీతిఁ ॥ దనరి కృష్ణ. 386

## కందగీతగర్భచంపకమాల.

చ. నరహరి కేశవా వనజ॥నాభ రమాధవ వంశహస్త బం
ధురసుగుణాకరా దురిత॥దూర జనార్దన దోర్బలాఢ్య గీ
[3]ర్వరగిరిశస్తుతా మురహ॥రా సురపూజితముఖ్యపాద సుం
దరపురుషాగ్రణీ భుజగ॥తల్ప శచీపతిపుత్త్రరక్షణా. 387

వ. ఇది భాషాపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. 388

## కందద్వయకమలవిలసితరుగ్మవతీగర్భక్రౌంచపదము.

ద్వారవతీనా॥థా సముదారా తరుణధవళకర ॥ ధరనుతనామా
మాఁరమణీధా॥మా సుకుమారా మరుదధిపతిరిపు॥మదగిరిశంబా
పారపనేత్రా ॥ సత్యవిచారా శరరుహభవముఖ॥సకలసురేశా
ఘోరకులా తే॥జోజితసూరా సురవరమణినిభ॥సురుచిరదేహా. 389

వ. ఇది వర్ణపరిచ్ఛేదములోఁ దెలియఁజేయఁబడియె. 390

## మత్తేభవిక్రీడితాగీతకందగర్భసీసము.

వినయసంపన్నర॥విప్రభూతరమణీనాథా పయోజేక్షణా నరాప్త
విధయదాకార మా॥విర్భగాయతరిపుప్రాణానిలాహీశ్వరా రమేశ
విలయకాలానల॥విక్రమప్రథిత సాల్వగ్రావవృద్ధశ్రవా వరేణ్యా
విలయశీలా యదు॥వీర కౌస్తుభధరా చక్రి యశోదాత్మజా ముకుంద
తే. కరివరద భూతనాంతక ॥ గరుడగమన, సత్యసహిత కామజనక ॥ శంకరసఖ
కనకవసన సుందరదేహ ॥ వనధిశయన, సనకమునివినుతచరణ॥సరసిజనయన. 391

వ. ఇది వళిప్రాసపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. 392

1 కనలు (ఓ). 2 విఖ్యాతి (ఓ). 3 ర్ధర (ప).

వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధురగర్భోత్పలమాలికావృత్తము.

ఉ. శారదశావితత్రసవచాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషధవ తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురత్రభవప్రాపకభండన వాసవానుజా
పారద వాసుదేవ భవపాపవిదండన భర్గపూజితా. 393

ఇది యీపద్యపరిచ్ఛేదముతుదను దెలిపెదము.

కల్పితకల్పవల్లీ ప్రహారణకలిత.

కరధృతకరుహాం కరిహితకరణం, కరుహాసఖరుచిం గరుడఖగరథమ్
ఖరనునకరవిం ఖరతరకరగం, గరళముఖరిపుం గరధరకరతమ్. 394

ఇది సంధిపరిచ్ఛేదములోఁ దెలిపెదము.

మఱియుఁ, గల్పితకల్పవల్లీ భాస్కరవిలసితము.

అక్షరహారివిశచాంబురుహాక్షా, యక్షపసఖనుత యదుకులదక్షా
రక్షకసురవిదురద్విపరక్షా, రాక్షసవిదళన ప్రరుచిరవక్షా
పక్షగపతిరథ పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి బహుసవదీక్షా
వృక్షగసహచర ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప ఋషిజనపక్షా. 395

గర్భప్రథమకందము.

అక్షరహారివిశచాంబురుహాక్షా యక్షపసఖనుత యదుకులదక్షా
రక్షకసురవిదురద్విపరక్షా రాక్షసవిదళన ప్రరుచిరవక్షా. 396

గర్భద్వితీయకందము.

పక్షగపతిరథ పౌండ్రవిపక్షా భక్షితదవశిఖి బహుసవదీక్షా
వృక్షగసహచర ఋక్షసదృక్షా ఋక్షపదుహితృప ఋషిజనపక్షా. 397

గర్భద్విపద.

అక్షరహారివిశచాంబురుహాక్ష, యక్షపసఖనుత యదుకులదక్ష
రక్షకసురవిదురద్విపరక్ష, రాక్షసవిదళన ప్రరుచిరవక్ష
పక్షగపతిరథ, పౌండ్రవిపక్ష, భక్షితదవశిఖి బహుసవదీక్ష
వృక్షగసహచర ఋక్షసదృక్ష, ఋక్షపదుహితృప ఋషిజనపక్ష. 398

లాలిపాట.

అక్షరహారివిశచాంబురుహాక్షా, యక్షపసఖనుత యదుకులదక్షా
రక్షకసురవిదురద్విపరక్షా, రాక్షసవిదళన ప్రరుచిరవక్షా. లాలి.

పత్నగపతిరథ • పౌంద్ర విపత్నా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృత్నగసహచర • ఋత్నసదృక్షా, ఋత్నపదుహిత్రుప • ఋషిజనపక్షా. లాలి. 399

## పెండ్లిపాట.

అక్షరహరివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన•ప్రరుచిరవక్షా. [1]గౌరీకల్యాణవై భవమే.
పత్నగపతిరథ • పౌంద్ర విపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృత్నగసహచర•ఋత్నసదృక్షా, ఋత్నపదుహిత్రుప•ఋషిజనపక్షా. గౌరీకల్యాణ
[వై భవమే. 400

## ధవళము.

అక్షరహరివిక చాంబురు•హాక్షా యక్షపసఖ
రక్షకసురవిదురద్విప•రక్షా రాక్షసవిదళన
పత్నగపతిరథ పౌంద్ర వి•పక్షా భక్షితదవశిఖి
వృత్నగసహచర ఋత్నస•దృక్షా ఋత్నపదుహిత్రుప. 401

## [2]సువాల.

అక్షరహరివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. సువ్వీ సువ్వాలలే. ౧
పత్నగపతిరథ • పౌంద్ర విపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృత్నగసహచర•ఋత్నసదృక్షా, ఋత్నపదుహిత్రుప•ఋషిజనపక్షా. సువ్వీ సువ్వాలలే.

## అర్ధచంద్రికలు.

అక్షరహరివిక•చాంబురుహాక్షుఁడా. ౧
యక్షపసఖనుత • యదుకులదక్షుఁడా. ౨
రక్షకసురవిదు•రద్విపరక్షుఁడా. ౩
రాక్షసవిదళన • ప్రరుచిరవక్షుఁడా. ౪
పత్నగపతిరథ • పౌంద్ర విపక్షుఁడా. ౫
భక్షితదవశిఖి • బహుసవదీక్షుఁడా. ౬
వృత్నగసహచర • ఋత్నసదృక్షుఁడా. ౭
ఋత్నపదుహిత్రుప • ఋషిజనపక్షుఁడా. ౮

---

1 'గౌరీకల్యాణానకై భావమే' అని (పూ. ప.) అలో వ్రాసియున్నది.
2 సువ్వాలే (పూ. ము.).

### [1]కందగర్భసీసరూపద్విపద.

మకరకుండలకర్ణ ◆ మహితాభ్రవర్ణ శకటదానవవిపక్ష ◆ కమలజాక్ష
శుభికాలసత్పాల ◆ సుయశోవిశాల యభిరమతస్నిగ్ధయా◆పీతదుగ్ధ
శ్రితదేవతరుమూల ◆ చేదీశకాల ధృతమణిధరగదారి ◆ తపతికథిత
వివసితవైకుంఠ ◆ నియతాబ్జకంఠర వికశాదశుభనేత్ర ◆ విజయమిత్ర
తే. సతతసనకాదిసన్నుత ◆ చతురచరిత, యాదవకుల సత్యనిరత ◆ యచ్యుత మధు
విదళన హరిశాశ్వతకృష్ణ◆విదురవరద, భవవిరించినుతా యంచుఁ ◆ బ్రస్తుతింప. 405

### గర్భద్విపద.

మకరకుండలకర్ణ ◆ మహితాభ్రవర్ణ
శకటదానవవిప◆క్ష కమలజాక్ష
శుభికాలసత్పాల ◆ సుయశోవిశాల
యభిరమతస్నిగ్ధ ◆ యాపీతదుగ్ధ
శ్రితదేవతరుమూల ◆ చేదీశకాల
ధృతమణిదరగదా◆రితపతికథిత
వివసితవైకుంఠ ◆ నియతాబ్జకంఠ
రవికశాదశుభనే◆త్ర విజయమిత్ర. 406

### గర్భకందము.

సతతసనకాదిసన్నుత, చతురచరిత యాదవకుల ◆ సత్యనిరత య
చ్యుత మధువిదళన హరి శా◆శ్వత కృష్ణ విదురవరద భ◆వవిరించినుతా. 407

### స్రగ్విణీగర్భభుజంగప్రయాతము.

నమో దాశకా వేణు ◆ నాదప్రవీణో, ద్యమా యాశుషేణా మ◆హాయావనారీ
రమాధీశ దామోద◆రా దేవదేవో, త్తమా భేశమిత్రాక్ష◆యింద్రానుజాతే. 408

### గర్భస్రగ్విణీవృత్తము.

దాశకా వేణునా◆దప్రవీణోద్యమా
యాశుషేణామహా◆యావనారీరమా
ధీశ దామోదరా ◆ దేవదేవోత్తమా
భేశమిత్రాక్ష యిం◆ద్రానుజాతే నమో. 409

---

1 కందగర్భద్విపదరూపసీసము (పూ.). 2 తార్క్ష్యసుయానా—(పూ. మ.) ఇందును యతిభంగము. 3 ఈచరణమున (వ. పూ.) అలోనివి పాఠము ఇందును యతి భంగము.

### కందగర్భమణిగణనికరము.

కరధృతజలజానిఁ • గరిపతివరము౯, వరతనురుచిజిత • వనమునిఁ బరము౯
బరివృఢుఁ గొలిచెదఁ • బరపదశరణము౯, శరవణభవనుత • చరితునిఁ గరుణ౯. 410

### గర్భకందము.

కరధృతజలజానిఁ గరిపతి, వరము౯ వరతనురుచిజిత • వనమునిఁ బరము౯
బరివృఢుఁ గొలిచెదఁ బరపద,శరణు న్శరవణభవనుత•చరితునిఁ గరుణ౯. 411

### చతుర్విధకందము.

రెండవచరణంబునకు, నె్రండవగణ మాది గాఁగ • నిర్మించిన నో
దండిఁ జతుర్విధకందము, పాండవపక్షా మెలంగుఁ•బ్రాజ్ఞులసభల౯. 412

### చతుర్విధకందము.

బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతోఁ
గలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప నింగితజ్ఞ•హితవుగ విపుల౯. 413

### గర్భద్వితీయకందము.

చిపిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమిం
గృప నింగితజ్ఞహితవుగ, విపులం బలులేమిచేత • వేసరుచెలికి౯. 414

### గర్భతృతీయకందము.

కలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప నింగితజ్ఞ•హితవుగ విపుల౯
బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతో౯. 415

### గర్భచతుర్థకందము.

కృప నింగితజ్ఞహితవుగ, విపుల౯ బలులేమిచేత • వేసరుచెలికిం
జిపిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమి౯. 416

### మాలికాచతుర్విధకందము.

తరతర మన్వర్ణ మాదిగ, దొరలించిన మాలికాచ•తుర్విధకందం
బరుదారును సత్కృతులం, నురగాధిపనవ్యాతల్ప • యుదధిశయానా. 417

క. శ్రీభూమీశ వరద హరి, గోభూమానవవినుత సు•గుణబుధ మధునా
శా భీమా నవకృష్ణఘ,నాభా మానవహరి దరి • యభవకమలనా. 418

గర్భద్వితీయకందము.

భూమీన వరదహరి గో, భూమానవవినుత సుగుణ • బుధ మధునాశా
భీమా నవకృష్ణఘనా, భామానవహరి దరి యభ•వకమలనా శ్రీ. 419

గర్భతృతీయకందము.

మీనవరద హరిగోభూ, మానవవినుత సుగుణబుధ • మధునాశా భీ
మా నవకృష్ణఘనా భా, మానవహరిదరియభవక•మలనా శ్రీభూ. 420

గర్భచతుర్థకందము.

నవరద హరిగోభూమా, నవవినుత సుగుణబుధమధు•నాశా భీమా
నవకృష్ణఘనా భామా, నవహరిదరియభవకమల•నా శ్రీభూమీ. 421

అష్టవిధకందము.

రెం డేసిగణంబులపై, నుండినగణ మాది గాఁగ • నొనరఁగఁ జదువన్
ఖండిత సౌంభకఘోటకి, తాండజ యష్టవిధకంద • మనఁ గాఁ బరఁగున్. 422

ప్రథమకందము.

తన కిరుగెలనను గనలుచుఁ, గొన బయి గిలిపెడుకనుగొలు•కులఁ దగుఁ జెలుచ
న్ఘనులను గలయం జెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను • ఖలశృంఖల సై. 423

ద్వితీయకందము.

కనలుచుఁ గొనబయి గిలిపెడు, కనుగొలుకులఁ దగుఁ జెలుచను • ఘనులను గలయం
జెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖల మయి • తన కిరుగెలనన్.

తృతీయకందము.

గిలిపెడుకనుగొలుకులఁ దగుఁ, జెలుచ న్ఘనులను గలయను • జెనఁకువఁ గనుచున్
గలుములఁ దనిపెను ఖలశృంఖల మయి తన కిరుగెలనను • గనలుచుఁ గొన బై.

చతుర్థకందము.

కులదగుజెలుచ న్ఘనులను, గలయం జెనఁకువఁ గనుచును • గలుములఁ దనిపెన్
ఖలశృంఖలమయి తనకిరు, గెలనను గనలుచు గొనబయి • గిలిపెడుకనుకొల్. 426

పంచమకందము.

ఘనులను గలయం జెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను • ఖలశృంఖల సై
తన కిరుగెలనను గనలుచుఁ, గొన బయి గిలిపెడు కనుకొలు•కులఁ దగుఁ జెలుచన్.

### షష్ఠకందము.

పెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖల మయి ♦ తన కిరుగెలనన్
గనలుచుఁ గొనబయి గిలిపెడు,కనుగొలుకులఁ దగుఁ బెలుచను♦ఘనులనుగలయన్.

### సప్తమకందము.

కలుములఁ దనిపెను ఖలశృం, ఖలమయి తన కిరుగెలనను ♦ గనలుచుఁ గొన బై
గిలిపెడుకనుకొలుకులఁ దగుఁ, బెలుచ న్ఘనులను గలయును ♦ బెనఁకువఁ గనుచున్.

### అష్టమకందము.

ఖలశృంఖల మయి తన కిరు, గెలనను గనలుచుఁ గొన బయి ♦ గిలిపెడుకనుగొ
లుకులఁ దగుఁ బెలుచ న్ఘనులను, గలయం బెనఁకువఁగనుచును♦గలుములఁదనిపెన్.

### కందద్వయనీలోత్పలమాలామణిగణనికరగర్భసరసిజవృత్తము.

శ్రీవర్ధిష్ణుం బావనజీవు ♦ న్జితభృగుతనయుని ♦ సిరి గలుగుటకై
భావింతు న్సంభావితభావుం ♦ బ్రతియుగసముదిత♦బహుతనుమహితున్
దేవేంద్రాదిప్రస్తుతదేవు ♦ న్దితితనయతుహిన♦దినకరకిరణున్
ధీవిద్యాద్యోతు న్వ్యాసుదేవు ♦ న్ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 481

### గర్భప్రథమకందము.

శ్రీవర్ధిష్ణుం బావన, జీవు న్జితభృగుతనయుని ♦ సిరి గలుగుటకై
భావింతు న్సంభావిత, భావుం బ్రతియుగసముదిత♦బహుతనుమహితున్. 482

### గర్భద్వితీయకందము.

దేవేంద్రాదిప్రస్తుత, దేవు న్దితితనయతుహిన♦దినకరకిరణున్
ధీవిద్యాద్యోతు న్వ్యాసు, దేవు న్ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 483

### గర్భనీలోత్పలమాల.

శ్రీవర్ధిష్ణుం బావనజీవున్ ♦ భావింతు న్సంభావితభావున్
దేవేంద్రాదిప్రస్తుతదేవున్ ♦ ధీవిద్యాద్యోతు న్వ్యాసుదేవున్. 484

### గర్భమణిగణనికరము.

జితభృగుతనయుని ♦ సిరిగలుగుటకై, ప్రతియుగసముదిత♦బహుతనుమహితున్
దితితనయతుహిన♦దినకరకిరణున్, ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 485

వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధురగతిగర్భోత్పలమాలికావృత్తము.

శారదశాసితప్రసవ ♦ చాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషధవ ♦ తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ ♦ ప్రాపకఖండన వాసవానుజా
పారదవాసుదేవభవ ♦ పాపవిదండన భర్గపూజితా. 436

గర్భవాణీవృత్తము.

శాసితప్రసవ ♦ చాపఖండనా ♦ సామసన్నుతా
దాసపోషధవ ♦ తాపసమండన ♦ ధర్మతత్పరా
భాసురప్రభవ ♦ ప్రాపకఖండన ♦ వాసవానుజా
వాసుదేవభవ ♦ పాపవిదండన ♦ భర్గపూజితా. 437

గర్భపద్మావృత్తము.

సవచాపవిఖండన ♦ సామసన్నుతా, ధవతాపసమండన ♦ ధర్మతత్పరా
భవప్రాపకఖండన ♦ వాసవానుజా, భవపాపవిదండన ♦ భర్గపూజితా. 438

గర్భాంబావృత్తము.

చాపవిఖండన ♦ సామసన్నుతా, తాపసమండన ♦ ధర్మతత్పరా
ప్రాపకఖండన ♦ వాసవానుజా, పాపవిదండన ♦ భర్గపూజితా. 439

గర్భరతీవృత్తము.

ఖండనసామసన్నుతా, మండనధర్మతత్పరా
ఖండనవాసవానుజా, దండన భర్గపూజితా. 440

గర్భదరధ్వనితాళము.

శాసితప్రసవ ♦ దాసపోషధవ
భాసురప్రభవ ♦ వాసుదేవభవ. 441

గర్భమధురగతిరగడ.

శాసితప్రసవ ♦ చాపవిఖండన, దాసపోషధవ ♦ తాపసమండన
భాసురప్రభవ ♦ ప్రాపకఖండన, వాసుదేవభవ ♦ పాపవిదండన. 442

ఆశ్వాసాంతగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కాకుమాను పల్లిపురమందిరనందనచరణా రవిందవందనాభిలాష మనీషాప్రాభవవేంకటార్యతనూభవవిద్యావిశేషగురాచార్య కాకునూర్యప్పకవివర్యవిరచితంబైనయాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రం

బునందు మూలసూత్రంబులును, ఛందఃప్రభావంబును, ఛందోవ్యాపక[1]సంప్రదాయంబును, ఛందస్స్వరూపంబును, నితిహాసాదిస్వరూపంబును, గద్యవచనంబులును, ప్రథమప్రత్యయోద్ధారణక్రమంబును, గణజననచ్ఛందంబులును, గురులఘువర్ణనిర్ణయంబును, సర్వగణలక్ష్యంబులును, గణాధిదేవతాఫలంబులును, అష్టగణలక్ష్యంబులును, దేవతానరాంకితనియమంబులును, నాయకగణకూటంబులును, గృత్యాదిగణద్వయకూటంబులును, ప్రశస్తకూటంబులును, దోషాదోషబాహుళ్యఫలంబులును, గణద్వయయోగఫలంబులును, గణనాథయోగఫలంబులును, షట్ప్రత్యయంబులును, బద్యలక్ష్యోపయోగిసంజ్ఞలును, షడ్వింశతిచ్ఛందోజాతసమవృత్తంబులును, ముఖ్యగౌణవృత్తంబులును, మాలికావృత్తవివేకంబును, జాత్యుపజాతులును, చిత్రబంధగర్భకవిత్వంబును గలచతుర్థాశ్వాసము సంపూర్ణము.



1 సాంప్రదాయకంబును (ప).

# పంచమాశ్వాసము.



కృష్ణాపూర్వతట
ప్రాకారప్రాంతకుతల♦పరిశోభితప
శ్రీకరకేతపరనగర
నాకారివిదితకీర్తి! రాజ♦నస్థితిభవనా. 1

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమున కాది♦ నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయుం, ధ్రిపచో వ్యాకరణసూత్ర♦తతిఁ దెనుఁగింతున్. 2

ఆ. ఆంధ్రసంధు లెల్ల♦ నష్టాదశార్యల, నుకవు లౌ నటంచుఁ♦ జోద్య మంద
ఛత్రితాద్రినాథ♦ శబ్దానుశాసనుఁ, డవనిఁ దేటపఱిచె♦ నతియుదమున. 3

## సంధిపరిచ్ఛేదము.

మూ. సూ. తిజ్ధ్యశేషషష్ఠీసుస్కర్మప్రవచనీయజవిభక్తిః,
కిఞ్చిత్ప్రిశంసనాద్యుతసన్తాపయుదాతదాకిమేనాం శ్చ. 1

త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతికలా ద్రుతో న యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యుః హ్యనుజీవితద్రుతా నిత్యమ్. 2

సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః,
లుక్సంశ్లేషౌ నాధి ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. 3

సన్ధిర్నాచో వ్యనుతో వాతో నాదిషు విభక్తిషూతో వా,
నిత్య మనుత్తమపురుషక్రియాస్వితర పరిమితౌ సమస్తనామ్. 4

న స్యాత్తద్ధర్మోత శ్చే ర్వాస్యా ద్వృత్తమానవిహితస్య,
తద్వత్తదాదిజస్య ప్రాయ స్తు స్యాత్క్రమాదికస్యేతః. 5

అపిశబ్దేత లు గ్వా స్యా దిచ్ఛ విభక్త్యన్తిమస్య జేరలిచ,
శబ్దాత్తచ్ఛబ్దాతో లు గ్ధారార్థేత ఉదపి రేఫ స్స్యాత్. 6

సామానాధికరణ్యే షూదన్తానాం టుగాగమో చి స్యాత్,

ధాతుపదసమ్భవానాం విశేషణానా ముక్త స్తథాను ముచి. 7

షష్ఠ్యా ఉకో చి ను మేస్న చాద్య స్యామ్రేడితేఽ న్త్యలోపశ్చ,
అహమాదీనాం ద్విత్వం లోపో నసు ఆదికే విసర్గశ్చ. 8

బో రద్భ్యశబ్దా ర్థే పో శ్చ శబ్దాద్యర్థవాచకే షూశః,
వికృతిపదే లా టో కప్రపథాంగే శ్చా వితశ్చ లు గ్వా స్యాత్. 9

పదమధ్యవరలడానా ముశ్చ పూర్వప్రయోగసిద్ధానామ్,
లోపో వా స్యా త్తేషా మిత శ్చ తద్వ త్త్రివిక్రమను తేన. 10

కవిభల్లటైక క్రియాణాం నామ్నా ముల్లోప ఇష్యతే హ్యేషు,
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోపి కథ్యన్తే. 11

ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవన్తీహ,
రుల్యాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసే చ. 12

ప్రథమావైభక్తికయో ర్లుక్ పూర్ణో వా పతి క్రియాంగే తు,
తస్య సమాసే పూపూ ను మ్వాతో హల్యధర్వణార్యమతాత్. 13

శత్రర్థే తూశ శ్చా నో స్తస్యా శ్చ పూర్ణబిన్దు రపి,
వాత్మాన్తదో ర్వృత్తస్య స్యా ల్లు గ్వా క్వాన్తగతపదానాం చ. 14

పరుషా ద్రుత ప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతం చ బిన్దుస్స్యాత్,
అవికారగతే తస్మి న్నపి సరళా ఏవ సన్తి తే పరతః. 15

లు గ్వా వ ప్రకృతిపదా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్,
అలుకి చ సంశ్లేష స్స్యా ద్బిన్దుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్. 16

ప్రథమలు గపి ద్విముల్యో ర్ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు,
హేమో క్తేర పరుషాణాం గసడదవా స్యుః పదాద్వన్ద్వే. 17

గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్మాన్తదో ర్వినా పరుషాః,
న వికృతిశబ్దా త్పరత స్సంస్కృతికానాం భవన్తి గసడదవాః. 18

ఇతి సకలభాషానుశాసన నన్నయభట్టవిరచితాన్ధ్రశబ్దచిన్తామణౌ
సన్ధిపరిచ్ఛేద స్తృతీయః.

వ. ఈశ్లోకంబులు పదునెనిమిదియును నలువదియొనిమిదిసూత్రంబు లయ్యె నవి యెల్ల నిందు వివరించెద.

తే. హేమచంద్ర త్రివిక్రమ♦నాము లాదిఁ
బ్రాకృతము త్రోవఁ జూపి రా♦ప్రాకృతంబు
నందు భేదంబుగావున ♦ నాంధ్రమునకుఁ
గలుగులక్షణ మెఱుఁగఁగ ♦ వలయుఁ గవులు. 5

ఆ. తెలుఁగుబాస యెంత ♦ దెలిసి యుండిన దీని, జనునకున్నఁ గవిత ♦ చక్కఁగాదు
ఇంటిలోన హేమ ♦ మెంత గల్గిన నేమి, తొడవు సేయకున్నఁ ♦ దొడుగ రాదు.

క. పదసంఘము చెవి నదికినఁ, బదపద్యము లార్యసభలఁ ♦ బరువడి హాస్యా
స్పదము లగుఁ గాన వైకృత, పదసంధివిధములు తేట♦పడిచెద వరుసన్. 7

క. [1]వసుధ విసంధియును మహా, విసంధియుఁ గుసంధిదోష♦విధమును దుస్సం
ధిసమాఖ్యము ననునాల్గును, బొసఁగింపరు సంధిదోష♦ము లటంచుఁ గవుల్. 8

తే. హరి ముసలికిని అనుజుండు ♦ అర్జునునకుఁ
జెలి యనుచు నిట్లు గుఱుసుస్రై ♦ శ్ర్ంగములయి
స్వరములకు సంధి గలుగక ♦ పాగకేని
దానిని విసంధి యండ్రు స♦త్కవులు కృష్ణ. 9

తే. సాల్వభూమివరు న్నండ♦జధ్వజుండు
ధరణిఁ గూల్చె సురల్ యచ్చు♦తంబు నొంద
ననుచుఁ బొల్లులవలపల ♦ నచ్చు లున్న
జరుగును మహావిసంధిదో♦షం బనంగ. 10

తే. మను వొకతె సారతెలనాకు♦మడుపు లీయఁ
బాలఁ దొకతె తెల్లసవరంబు ♦ బూని విసరఁ
జే డొకతె చక్రితో నెత్త ♦ మాడె నవఁ గు
సంధి యగు నిట్లు గలయని♦సంధు లదుక. 11

క. ఎందును దుస్సంధిసమా, ఖ్యం దిర మగు నందు నిందు ♦ ననుచో నందు
న్నిందు న్నని పై నచ్చులు, పొందక సముచ్చయనకార♦ములు కృతి నూఁదన్. 12

తే. తొలుత నిసంధిదోషచ♦తుష్టయంబు, చెంద కుండఁగఁ గావ్యము♦ల్చెప్పవలయుఁ
గానఁ దెలియంగ సంధిల♦క్షణము లెల్ల, విన్నవించెద గోపాల ♦ విమలశీల. 13

క. వుఱుములు ప్రథమైకోక్తికిఁ, గడఁ గూర్చిన యవి విభక్తి♦కం బనఁబడుఁ బా
ల్పడి యవి చెందనినుడు గొప్పడు నవిభక్తికము నామ♦మును నవఁబరఁగున్. 14

1 ఎసఁగ (పూ. ము).

క. తరు వనఁ వారుఁ డనఁ బుర మనఁ, బరగ నివి విభక్తికములు ♦ బరువు [1]పురుడు సుం
దరి దుర మనునివి యెల్లను, నరసఖ యవిభక్తికములు ♦ నామములు నగున్. 15

ఆ. [2]వెనుక నున్నపదము ♦ కొనయక్షరంబుతోఁ, బైపదంబు మొదలి ♦ ప్రాణమునకు
నూత్రమునను సంధి ♦ చొప్పడకున్న, నప్పట్లు బుధులు ప్రకృతి ♦ భావ మండ్రు. 16

క. తొలఁగి చనుఁ దొలఁగ కుండును, గలుగును లే కుండు నొకటఁ ♦ గా కుండును ని
చ్చలు వచ్చును రాకుండును, జెలువార వికల్ప మనుచుఁ ♦ జెప్పెడుచోటన్. 17

క. మొదలను జెప్పినవిధమున, కొదవు వికల్పంబు లేక ♦ యొక్క తెలుఁగునన్
బదపడి నిలిచినదానిని, యదుగోత్రపవిత్ర నిత్య ♦ మందురు ధీరుల్. 18

తే. పుడమిఁ దొల్లింటిరాజుల ♦ వెడల నొత్తి, వారి నెళవులఁ దా మొండు ♦ వైరినృపుల
పగిది మును పున్నవ్రాలను ♦ బాఱఁ దోలి, తా మచట నిల్చు నాదేశ ♦ నామకములు.

తే. వెండికొండను నెలకొన్న ♦ వేల్పు శూలి, చెంత నత్యంతమైత్రిమైఁ ♦ జేరి యుండు
యక్షుగతి శబ్దమునఁ గల్గు ♦ నక్షరంబు, పొంత నుక్కాగమము పొందుఁ ♦ బూనినిల్చి.

తే. పదములను మున్ను గలవ్రాలఁ ♦ దుదిని దామ, నతికి కొని నిల్చి లిపులు ప్ర ♦ త్యయము లయ్యె
మున్న పదములఁ గలవర్ణ ♦ ములు నిలుపక, తొలఁగి చనుట లోపం బని ♦ పలుకఁబడును.

## ద్రుత ప్రకృతిక సంజ్ఞ.

మూ. సూ. తిఙ్ధ్యశేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తిః,
కిఞ్చిత్ప్రశంసనాద్భుతసన్తాపయుదాత్తదాకిమేవాశ్చ.
క్త్వాన్తకిలతూష్ణీమాద్యా నభిదధతి కలా ద్రుతేన యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్. 1

క. వలసినచోఁ దుది ద్రుతములు, తలచూపెడుశబ్దములు ద్రు ♦ తప్రకృతు లనన్
వెలయు నవి వొడమ కుండెడు, తెలుఁగుపదంబులు కళా ప్ర ♦ దేశము లయ్యెన్. 22

తే. ధాత ధాతను భూపతి ♦ ధరణిపతిని
జనకు జనకుని గనియెఁ గ ♦ న్గొనియె ననుచుఁ
గడ ద్రుతము లిట్లు లోపము ♦ ల్గాంచి వలయు
పట్లఁ గనుపట్టునవి ద్రుత ♦ ప్రకృతు లిక. 23

క. వికృతిపదంబుల లోపల, నకారములు వలయుచోఁ గొ ♦ నలఁ బొడము ద్రుత
ప్రకృతు లసంఖ్యంబులు గొం, కక యవి యెన్నంగ వలవ ♦ గా దహిపతికిన్. 24

---

1 పురుఁడు (షీ.). 2 వెనక (ప. షీ.).

తే. గూను సెమ్మెను మెడ నాను ♦ మీను పేను, [1]మ్రానువతిచేను బులిబోను ♦ మఱియు నిట్లు
భువి నకారంబుతోఁ గూడఁ ♦ బుట్టుశబ్దములు ద్రుతప్రకృతులుం గావు ♦ మునిశరణ్య.

తే. అన్ను బంగరుపొన్ను చా ♦ య యగు తెన్ను
చెన్ను పులిజున్ను దొరపన్ను ♦ జొన్న యెన్ను
మొదలు గా జడ్డలు నకార ♦ ములకుఁ దుదిని
దనరుపదములు గావు ద్రు ♦ తప్రకృతులు. 26

ఆ. తన్ను నిన్ను నన్ను ♦ విన్ను మున్నామిన్ను, చన్ను కన్ను వెన్ను ♦ శబ్దములకు
జడ్డ లుండుఁ బోవుఁ ♦ జర్చింప నివి ద్రుత, ప్రకృతు లెపుడు గావు ♦ భక్తసులభ.

## కళాప్రదేశములు.

సీ. ఇనుఁడు గోత్రమా గోవు జను లని యిబ్బంగిఁ బలికెడు ప్రథమావి ♦ భక్తులందు
రాముఁ గూర్చి రణోగ్ర ♦ భీముఁ గూర్చి యటంచుఁ దెలిపెడుకర్మద్వి ♦ తీయలందుఁ
గృష్ణునకై సురో ♦ చిష్ణునకై యని తొడిఁబడ నుడుగుచ ♦ తుర్థులందు
బలునిబట్టి మురారిఁ ♦ బట్టుండి యని పలికెడుపంచమీవిభ ♦ క్తులందుఁ

తే. బద్మబాంధవసుతయొక్క ♦ భద్రయొక్క
జాంబవతియొక్క యనుషష్ఠి ♦ పక్షులందు
కలిసముచ్చయములఁ దక్క ♦ ద్రుతము గానఁ
బడదు [2]గావున నవిపల్కఁ ♦ బనుఁ గళలని. 28

సీ. సుగ్రీవుఁడే వాయు ♦ సూనుఁడే యనుచు నేవార్థము ల్దెలుపువ్యా ♦ హారములును
నటియించెనఁట పాడె ♦ నట కూడెనఁట యను లలితకిలార్థాను ♦ లాపములును
వింటిమి ఱంటిమి ♦ వేఁడి రటంచు హివమాడ్కిని బలుకుతి ♦ జ్మధ్యములును
గాంచి విచారించి ♦ కరుణించి యనియెడుక్త్వాప్రత్యయాంతార్థ ♦ వాచకములు

తే. నుఱక మిన్నక సేయక ♦ రొయుఁగక యను, నట్టితూష్ణీంపదార్థవా ♦ క్యములు నాది
శబ్ద ముండుటచేతను ♦ జనియె సుమ్ము, కనియెఁ గద యనునవియును ♦ గళలుకృష్ణ. 29

తే. నవ్వుచున్నాఁడు వచ్చుచు ♦ న్నాఁడు వాఁడు
మనఁ గలడటన్న తిజ్మధ్య ♦ మంబు లెందుఁ
గాకయును బ్రథమలలోనఁ ♦ గలసి సరవి
జాతనేత్ర కళాప్రదే ♦ శంబు లగును. 30

సీ. కటకట యక్కట ♦ కట్ట యయ్యో యని పరితాపమునఁ బల్కు ♦ భాషణములు
డోర బళీ [3]మజ్జ ♦ యయ్యారె యంచుఁ బ్రశంసించునంధ్రభా ♦ షాపదములు

---

1 మానుపటిచెను (పూ, ము). 2 గావునఁ బల్కఁగా (ప); గావున నివి(ఓ).
3 ఝూరె (ప).

నిది క్రొత్త యిది వింత • యిది లెస్స యద్దిరా యోహో యనుమహాద్భు • తోదితములు
నించుక గోరంత • యిసుమంత చీమంత యావంత యనుకించి • దర్థములును
తే. హరిహరీ యాత్తజనసఖ యిప్పు • డప్పు డెప్పు డనియెడు యదాతదాద్య[1]శ • బ్దాన్వయములు
నెద్ది యెయ్యది [2]యేటది • యేమి యనుకి, మర్థములును గళాసంజ్ఞ • లంగజపిత. 31
తే. ఇంతిరో కావు తెలుఁగున • నిట్టికళలు, మధునిషూదన వెదకిన • మతియుఁ గలవు
వీనికొనల ద్రుతంబులు • గానఁబడవు, తాపసమనోనివేశ కా • మేపలేశ. 32

## సంధివివేకము.

క. [3]వెనుకటిశబ్దమునకుఁ దుదిఁ, దనరెడువర్ణమును బైప • దమునకు మొదలం
గనుపట్టునక్షరంబును, సనకస్తుత కూర్చి పలుక • సంధి యనఁ జనున్. 33
క. విను ప్రాణసంధులును వ్యం,జనసంధులు ననఁగ శబ్ద • సంధులు కృతులన్
దనరారు నిరుదెఱంగుల, గొనకొని తద్విధము తెలిసి • కూర్పఁ దగు హరీ. 34
ఆ. మీఁదిశబ్దములకు • నాదివర్ణంబులుఁ, స్వరము లైనఁ బ్రాణ • సంధు లయ్యె
హల్లు లయ్యె నేని • వ్యంజనాక్షరసంధు, లయ్యె వాని తెఱఁగు • లరయవలయు. 35
తే. [4]హల్లు లై హల్లు లెల్లను • బుట్టి పిదపఁ, బ్రాణములఁ గూడుకొని బహు • భంగు లైన
కతన హల్లులఁ గలతల • కట్లుగుడులు, మొదలుగానిన్నియును స్వరం • బులునిజంబు. 36
ఆ. ఎచట సంధి గలుగు • నచటఁ బూర్వపదాంత, హల్లుతోడఁ గూడి • నట్టిస్వరము
లోపముగ నొనర్చి • యాహల్లుతో మీఁది, యక్షరంబు గూర్ప • నయ్యె సంధి. 37

## స్వరసంధిలక్షణము.

క. అరయ శకంధ్వాదిషు పేః, పరరూపం వాచ్య మనుచుఁ • బ్రక్రియలోనన్
వరరుచివాక్యముకలిమిని, బరరూపమె వికృతిఁ గానఁ • బడు స్వరసంధిన్.

తే. కృష్ణుఁ డవ్యయుఁ డాద్యుఁ డి • భేంద్రవరదుఁ
డీశ్వరుం డుత్తముం డూర్జి • తేష్టఫలదుఁ
డేకపదుఁ డైంద్రసఖుఁ డోష • ధీశుఁ డౌర్వ
శేయనుతుఁ డన సంధులు • వెలుఁగు నిట్లు. 39

## ఆంధ్రపదాదియుకారమునకు

మూ. సూ. సర్వత్రాజ్వత్త్వాత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః.

1 శబ్దార్థములును (పూ. ము). 2 యెదియేది (పూ. ము). 3 వెనకటి (ప. ఓ).
4 హల్లు (పూ. మా).

ఉ. అరయ వైకృతోక్తులఁ బ౹దాదులయందు నకార ముండ దా
తీరునఁ బల్కవ్రాఁత గణు౹తింపఁగ నచ్చగు దానిడాపలన్
నీరజనాభనాంతములు ౹ నిల్చిన నచ్చటఁ బ్రాణసంధి చె
న్నారు నితండు వైద్యవసు౹ధాధిపు నేపడఁగించె నేఁడనన్. 40

వాక్యము. నాంతము లనఁగా ద్రుతప్రకృతులనుపేరు. 41

క. శృంగాంత్యవక్రయుగముల, సాంగత్యము వాకు నాంధ్ర౹సంస్కృతముల నా
దిం గలుగ దట్టివ్రాఁత ధ్వరం గలయుద్రుతాంతములను ౹ బ్రాణములట్లన్. 42

క. మంగామురువులు నాలుగు, నుంగరములు మూఁడు నేడు ౹ నొడ్డాణంబుల్
పొంగుమ నొసంగి హరి యొక, యంగనను రమించె నన ను౹దాహరణంబుల్. 43

ద్రుతప్రకృతిస్వరసంధిలక్షణము.

సూ. సూ. లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు. 3

తే. అచ్చు పరమైన నాంతప౹దాంతమునకు, సంయుతమును లోపంబును ౹ జగతి లేవు
సంయుతం బయ్యెనేని దు౹స్సంధి యగును, లోపమైన గ్రామ్యం బగు౹లోకవినుత.

ఆ. చూచె నింతి ననెడు ౹ చోటఁ జూచె న్నింతి
ననిన సంధిదోష ౹ మయ్యెఁ గృతులఁ
బొడిచె నర్కుఁ డనెడు ౹ నెడఁ బొడిచెర్కుండు
ప్రాచి ననఁగ గ్రామ్య౹భాష యయ్యె. 45

క. ధరణి ద్రుతప్రకృతులపై, స్వరపూర్వపదములు గదిసి ౹ సంధి గలయుచో
నరకాసురదమన ద్రుతా, క్షరములు లోపములు గాక ౹ కడపల నిలచున్. 46

క. అవిభక్తికతత్సమములు, భువి నటువలె నుండు నాంధ్ర౹ములు నచ్చులపైఁ
గననీవను బ్రకృతిభావము, లవు శృంగాంతములు దక్క ౹ నహిపతిశయనా. 47

ఆ. హరి యొసంగు మోక్ష ౹ మాచక్రి యంగన
యందు భక్తి నిలుప ౹ నబ్బు సిరులు
నిక్క మనుచు దీని ౹ ముక్కంటి యెఱుఁగును
నలువ యెఱుఁగు గట్టు౹తులువ యెఱుఁగు 48

తే. కుత్సనుత యవిభక్తిక౹తత్సమాంధ్ర, శబ్దముల రెంటికొమ్ముల ౹ స్వరము లదుకు
కీతరు కృద్రిరా జేంద్ర౹జిత్తనంగఁ, బచ్చవిలుదాలు పెక్కుడు౹బంటు నంగ. 49

వ్యంజనసంధి.

క. పొల్లు లగువ్రాల కవతలి, వాల్లులు ద్విత్వంబు లగుచు ౹ నకురాంతక సం
ధిల్లును వ్యంజనసంధులు, తెల్లముగాఁ దద్విధంబు ౹ తెలియఁగ నలయున్. 50

తే. ప్రాణపరుషాదిసంజ్ఞలు ♦ పలికి వాని, యం దొకక్కరమునకు ల♦క్ష్యములు పలికి
దాని తెలుఁగున నాసంజ్ఞ ♦ దనరునట్టి, వ్రాల కెల్లను బట్టింప♦వలయు నెన్ను. 51

అకారాదిసంధులు.

మూ. సూ. సంధిర్నాచోఽచ్యనుతేః. 4

తే. పొల్లు గాగుపూర్వశబ్దాంత♦హల్లుమీఁదఁ, బరపదాద్యచ్చు నిలిచెడుఁ ♦ బ్రాణసంధి
కొమ్ముపైఁదక్క నితరస్వ♦రమ్ముమీఁద, నచ్చు గదిసిన వచట లే ♦ దాంధ్రమునకు.

సీ. కడు లెస్స యగుపట్టు♦కమ్మిపుట్టం బన జాళువాయొఱపుప♦[1]చ్చడ మనంగ
సిరియున్నఁ బురణించు ♦ చిన్ని నెమ్మోమున వలదు సుమీ యింత♦వైర మనఁగ
జన్నెయాపులపాల♦చవి చెప్ప రా దన రేయెండ విరహంబు ♦ రేఁపు ననఁగ
మైయొప్పు చూపట్టెఁ ♦ బైయంట వెదకినఁ గలదో యించుక లేదొ ♦ కౌ ననంగ
తే. ఘన మొకో యింతులకుఁ జక్కఁ♦దన మనంగ
నలినము నివాసమా యెల♦నాగ హరికి
దేవి యన నిపదింటిపైఁ ♦ దెలుఁగులందు
స్వరము లెదిరినఁ బ్రకృతిభా♦వంబె నిలుచు. 53

క. ఒప్పగుపేరిద నొప్పుల, కుప్ప ననారతము నుంచు♦కొని గోవిందుం
డెప్పుడు భోగించు ననం, దప్పక కొమ్ముపయిసంధి♦దనరు రమేశా. 54

అదంతసంధి.

మూ. సూ. వాతః. 5

తే. నెట్టన వికల్పమునఁ దల♦కట్టునకును, స్వరము పై నిల్చునప్పుడు ♦ సంధి కలుగు
హరికి బలదేవుతల్లి పె♦ద్దమ్మ యనఁగ, నల్లపాండునిసతి మేన♦యత్త యనఁగ. 55

విభక్తిసంధి.

మూ. సూ. అనాదిషు విభక్తిషూతో వా. 6

తే. ప్రథమఁ దక్కంగ నితరవి♦భక్తులందు
దుదలఁ గొమ్ములు గలవిభ♦క్తులకు షష్ఠిఁ
బలుకు కాగుడికిని విక♦ల్పంబువలన
నిల ద్రుతప్రకృతిత్వంబు ♦ గలుగుచుండు. 56

సీ. నిన్ను నే నెఱుఁగంగ ♦ నే నెంతవాఁడను న న్నేలుకొనుము ఘృ♦ణాసముద్ర
సారె నీకొఱకు నం♦జలి మోడ్చి మ్రొక్కెద నిమ్ము నాకొఱ ♦ కైహికమ్ము లెల్ల

---

1 ఇట్టిమాటలలోఁ 'చ్చ' కు బదులుగా 'త్స' కొన్నియెడల వ్రాతప్రతులలోఁ గనఁబడుచున్నది.

నీకు నాశ్రితులు వా•ణీనాథముఖ్యులు గణుతింప నా[1]కేఁడు•గడయు నీవె
నిలువఁ జేయుము నాకు • నీయందు నతిభక్తి స్వజనులం దర్శిలి•నిజము నీకు

తే. ద్రౌపదికి నక్షయాంబర•దాన మిచ్చి, సవ్యసాచికాయోధన•జయ మొసంగి
ప్రోచుపగిదిని మమ్ము నె•ప్పుడును గావు, మయ్య శ్రీకృష్ణ యనఁగ•లక్ష్యంబులయ్యె.

తే. రాముఁ డధికుండు తారక•బ్రహ్మ మాత్రి, తౌఘసురధేను వామేటి•యనుజ లహిత
భంజను లటంచుఁ బ్రథమాది•భక్తులందుఁ, గొమ్ములకు సంధి వచ్చు ని•త్యమ్ముగాఁగ.

తే. కూర్చి విడిచి ద్వితీయఁ బ•ల్కునవి మూఁడు
నవతలివిభక్తిఁ దెలుపువా•క్యములు నాల్గు
వలనఁ గంటె లోపల నను•వచనములును
బదివిభక్తులు లో ద్రుత•ప్రకృతు లయ్యె. 59

సీ. తాటక నొకకోల • ధరణిపైఁ గూల్చెను మొక్కలపుసుబాహు•ను ఖండించె
మౌనుల నానంద•మగ్నులఁ గావించె వారిచే నందె దీ•వనలు పెక్కు
జనకునిచేత న•ర్చనములు గావించె ఘనతతో నధ్వరా•గారమునను
వరశక్తితోడ నీ•శ్వరువిల్లువిఱిచెను నరులకంటె నమర్త్య•వరులు పొగడ

తే. వెస విదేహునివలన సు•ర్వీతనూజ
మిథిలలోపల నుద్వాహ•విధిని జెందె
ద్యుమణికులుఁ డన నివి విభ•క్తులు పదియును
ధరణి ద్రుతప్రకృతికలు ని•త్యముగ నగును. 60

## భూతార్థక్రియాసంధి.

మూ. సూ. నిత్య మనుత్తమపురుషక్రియా స్వితః. 7

తే. వసుధ నుత్తమపురుషైక•వచనమునను
దక్క భూతక్రియాపదాం•తములఁ గల్గు
నిత్తులకు మీఁద నచ్చులు • హత్తునపుడు
నిత్యముగ సంధులు ఘటించు • దైత్యదమన. 61

తే. పుడమి నూత్రోక్త ముత్తమ•పురుష మనుచుఁ
దత్పురుష మెల్లఁ గొన రాదు • తద్బహూక్తి
మున్ను తిఙ్మధ్యములతోడ • నెన్నుకతన
నిత్యముగఁ బ్రాణసంధి దా•నికి ఘటించు. 62

---

1 కేఁడుగడయు (ప). 2 లోన (ప).

తే. వనిని దీవించిరఁట మునీ♦శ్వరులు నిన్ను, రవిజు నేలితివఁట నీవు ♦ రామచంద్ర
మీరు గట్టితిరఁట కపు♦లార జలధి, వింటి మీవార్త మేమన ♦ వెలయునిట్లు. 63

క. విరచించెను శ్రీనాథుఁడు, ధరణిని శృంగారనైష♦ధంబునఁ "గూర్చుం
డిరి యొండొరు"నని కానక, పరపురుషక్రియలఁ బ్రకృతి♦భావముఁ గలదే. 64

వ. నైషధంబున గుడిమీఁద విసంధిగా శ్రీనాథుఁడు చెప్పినపద్యము. 65

మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణు♦ల్పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి య♦ర్థిం దత్ప్రదేశంబున
న్నలనాళీకమృణాళనాళలతికా♦నవ్యప్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధానుభవలీ♦లాలోలచేతస్కులై. 66

క. గరుడధ్వజ ప్రథమోత్తమ,పురుషైకవచనము లెల్ల ♦ భూతార్థమునన్
ధర నగును ద్రుతప్రకృతులు, భరియించె నుపేంద్రుఁ డేను♦ బ్రతికితి ననఁగన్.

వర్తమానక్రియాసంధి.

తే. వర్తమానత్రిపూరుష♦వచనములకు, జరుగుస్వరసంధు లని శబ్ద♦శాసనుండు
చెప్పఁడయ్యెఁ గొమ్ములసంధి♦సిద్ధమగుటఁ, బ్రథమసూత్రంబునన కానఁ♦బడుటఁ జేసి.

మ. చనుచున్నాఁ డదె వీరి గోపకులు పం♦జ్జం జీరుచున్నా రహో
యనుచున్నా వఘుశైరి నీ వరుగు కా♦ర్యం బే మన నిమ్మరలు
న్వినుచున్నా రెఱుఁగింపుఁ డెద్దియును దా♦నే చెప్పుచున్నా నికన్
జనులారా చోరనీయ మావ్రజము ని♦చ్చ ల్నిల్చుచున్నా మనన్. 69

భావిక్రియాసంధి.

తే. భావిపదములలో ద్రుత♦ప్రకృతి గాన, నోర్వఁ గల ననును త్తైమో♦త్తో త్తి దక్కఁ
దక్కనవి శృంగములు తుదిఁ♦దాల్చుకతన,స్వరపరము లైన నిత్యమై♦సంధిఁ జెందు.

తే. కావఁ గలఁ డచ్యుతుఁడు మెచ్చఁ ♦ గల రమరులు
తోడరఁ గల వర్కనందను♦తోడ నీవు
మెలఁగఁ గల రానరుపిఱుంద ♦ మీరు భూమి
కాంతులార మేమును బాడఁ ♦ గల మనంగ. 71

పరిమాణసంధి.

మూ. సూ. పరిమితౌ సమస్తానామ్. 8

సీ. కనిపెడు వ్రేలెడు ♦ కమికెడు జేనెడు మూరెడు చేతెడు ♦ బారె డనఁగఁ
కొలెడు పుడిసెడు ♦ చేరెడు దోసెడు గంపెడు పుటికెడు ♦ గాదె డనఁగఁ

జెంబెడు మత్తెడు ♦ చెరవెడు బింబెడు పఱఁటెడు కంచెడు ♦ బాసె డనఁగఁ
బారెడు చిట్టెడు ♦ పడెడు సోలెడు తవ్వె డామానికంచెడు ♦ తూమె డనఁగఁ

తే. దక్కు డన వీసె డన నొక్కు ♦ చిక్కు డనఁగఁ
వాటె డన మోపె డనఁ బెద్ద ♦ వామె డనఁగఁ
బరిమితార్థంబు తుది నిల్చు ♦ పట్ల నిట్లు
ప్రాణముల నెల్లఁ దఱిమి సం ♦ క్రమములు బలయు. 72

### తద్ధర్మార్థ క్రియాసంధి.

మూ. సూ. న స్యా త్తద్ధర్మోక్తః. 9

తే. ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథ ♦ మోత్తమాఖ్య, పురుషముల నేకవచనముల్ ♦ పోవవిడిచి
కడమ పదములు తిఙ్మధ్య ♦ కము లుఁ గానఁ, గొమ్ములను బ్రాణసంధులు ♦ గూర్చుటొప్పు.

క. కాంతు రజప్రభృతులు నిను, సంతతమును బ్రోతు వీవు ♦ సనకాదుల మ
ర్దింతు రభవుండు నీవును, బంతంబుల ఖలుల నను ♦ భావింతు మెదన్. 74

క. వదలక తద్ధర్మములను, బొదలెడు ప్రథమోత్తమాఖ్య ♦ పురుషైకవచః
పదములు ద్రుతప్రకృతు లగుఁ, బదరును నతఁ డోర్తు నేను ♦ బలుమఱు ననఁగన్.

### వర్తమానార్థ ద్రుతప్రకృతులు.

మూ. సూ. చోర్వా స్యా ద్వర్తమానవిహితస్య. 10

తే. పదపదార్థ మపేక్షింపఁ ♦ బడినయట్టి, వర్తమానార్థమున షష్ఠ ♦ వర్గశృంగ
కంబుతుదిఁ గల్గుపదము వి ♦ కల్పమున ద్రుతప్రకృతి యగుఁ గైటభ ♦ దర్పదళన.

క. కేరుచు నొయ్యన దగ్గరఁ, జేరుచు నురుముష్టిహతికిఁ ♦ జిక్కక వేగం
దారు చమత్కృతిఁ గ్రమ్మఱ, దూరు చధోక్షజుఁడు మల్లుఁ ♦ ద్రుంచె ననంగన్.

### త్రాదాదులు.

మూ. సూ. తద్వ త్త్రాదాదిజస్య. 11

క. తుదిగుదుల ననుకువది యిది, మొద లగుపదముల వికల్ప ♦ మున స్వరసంధు
ల్పదతి య దెవ్వతె చెపుమా, యది యిది యని నన్నుఁ బలుక ♦ వన లక్ష్యంబుల్.

### కిమాదులు.

మూ. సూ. ప్రాయ స్తు స్యా త్కిమాదిక స్యైతః. 12

క. కమలాక్ష యేమి యను వాక్యము మొద లగు వానితుదలఁ ♦ గలగుడులను బ్రా
ణము లడుకు వికల్పంబున, హిమగిరి యే మనియె నేమి ♦ యిచ్చె మన కనన్. 79

అపిశబ్దసంధి.

**మూ.** సూ. అపిశబ్దే తో లుగ్వా స్యాత్. 13

క. ఏని యనుమాటకడపలఁ, గానంబడు నిత్తుమీఁదఁ • గదిసినచోటఁ
బ్రాణములు సంధి గాంచును, బూని వికల్పంబువలనఁ • బుణ్యచరిత్రా. 60

తే. పలుకుచెలియేని నాప్రాణ•భర్తయేని, వనజభవుఁడేని యహికుల•స్వామియేని
నీమహత్త్వంబు వర్ణింప • నేర్చు నెట్లు, నా నుదాహరణంబులు • దానవారి. 81

క్త్వాప్రత్యయాంతార్థసంధి.

ఆ. వారిజాతనేత్ర • క్త్వాప్రత్యయాంతార్థ,ములు వచింతుఁ దెలుఁగు•పలుకులకును
నైస్వరంబు లుండు•పట్టులఁ బ్రకృతిభా,వంబు గాని సంధి • వాటపడదు. 82

ఆ. కాంచి యాలకించి • యెంచి యాలోకించి
యొరసి యాడి యోడి • యొరగి యెఱిఁగి
యంటి యెచ్చి యిచ్చి యని • యాడుకొని యొత్తి
యెనసి యేగి యూగి • యనఁగ వచ్చు. 83

ఇకారాదేశవిభక్తులు.

**మూ.** సూ. ఇచ్చ విభక్తౌ త్రిమస్య. 14

క. లలి నాదేశము లగుని,త్తులు సమసనములను జేత • తోడ వలన లో
పల ననునివి మొద లగుపలు,కులతుదిఁ దలకట్టులకు వి•కుంఠతనూజా. 84

ఆ. కృష్ణువలనిబలిమి • కేశవుతోడిస,ఖ్యంబు శకటదాన•వారిచేతి
పోరిపు భాగవతుల•లోపలిగణనయు, ధవళవాహనునకుఁ • దక్కఁ గలదె. 85

అల్యాదేశము.

**మూ.** సూ. జే రలిచ. 15

ఆ. కడవిభక్తు లైన • నుడుగుల కలి యను, నాగమంబు వచ్చు • నంత్యములను
సమసనమున శేష•శాయియందలిభక్తి, వొడమునతఁడె లోక•పూజ్యుఁ డనఁగ.

ఆదిలోపము.

**మూ.** సూ. శబ్దా త్తచ్ఛబ్దాదే త్తో లుక్. 16

తే. శబ్దముతుదను నది యను • శబ్ద మదుకు, నప్పు డది యనుపదమున • కాది నుండు
నత్వము వికల్పమున లోప•మగును గాన, నిది ప్రకృతిభావమున నుండు•నిందిరేశ,

తే. పాసఁగు లోపప్రకృతిభావ•ములను వరుస
బాపనది కోమిటిది మంచి•కోఁపది యన

మహిని బాపనయదియుఁ గో॥మటియదియును
గాఁపయదియును ననఁగభ॥క్తజనవరద. 88

## ఉదాదేశరేఫాగమములు.

మూ. సూ. దారాద్ధేత ఉ దపి రః. 17

తే. కొనలఁ దలకట్టు గలసురో॥క్తులకు మీఁదఁ
గర్మధారయసమసన॥కల్పనమున
నా లనుత్రిలింగదేశవా॥క్యంబు గూర్ప
మహి నుదాదేశరేఫాగ॥మములు వచ్చు. 89

అ. బుద్ధిమంతురాలు ♦ పుణ్యాత్మురాలు ద,యాసముద్రురాలు ♦ దాసురాలు
వినుతశీలురాలు ♦ ఘనురాలు గంభీరు, రాలు విష్ణుపెద్ద॥రాణి యనఁగ. 90

## టుగాగమము.

మూ. సూ. సామానాధికరణ్యే షూదన్తానాం టుగాగమో౽చిస్యాత్.

క. శమితాఘ కర్మధారయ, సమసనమునఁ దుదిని గొమ్ము ♦ సంధిల్లెడుశ
బ్దములు వికృతిఁ బొల్లటకా,రము వెట్టుక సంధిఁ జెందుఁ॥ బ్రాణముతోడన్. 91

అ. అక్కజంపుటడవి ♦ నల్లకూర్పణఖముక్కు, మెఱుఁగుటంపమొనను॥దటిగివై చెఁ
జిగురుటాకు గోటఁ॥జిదిమినచాడ్పునఁ, గఱకుటసుర లులుక ♦ గ్రహపకులుఁడు.

## విశేషణాంతద్రుతాగమము.

మూ. సూ. ధాతుపదసమ్భవానాం విశేషణానా ముత్త స్తథాన గచి. 19

తే. క్షితిని బైపదములకు వి॥శేషణంబు, లగుక్రియాపదములతుది ♦ నమరుశ్యంగ
మునకు వచ్చు నాగమ మయి॥పొల్లద్రుతము, ప్రాణపర మైనఁ గర్మధా॥రయమునందు.

క. అనుటయు నతండు కవ్వడి, కనుఁగొనియెడునతఁడు మాద్రి॥కడపటికొడు కొ
మొనసందునతఁడు వడమూడి, వెనుసనునతఁ డర్కసుతుఁడు ♦ విరథుఁ డనంగన్. 94

## షష్ఠీసమాసద్రుతాగమము.

మూ. సూ. షష్ఠ్యా ఉతో చి ను మ్వే చ. 20

తే. కొమ్ముమీఁద షష్ఠీసమా॥సమ్మునందు, న చ్చెగురఁ బొల్లద్రుత మగు ♦ నాగమంబు
కొడుకునాలు నేనుఁగునొడ॥ల్లొడవునొఅపు, రాజునానతి ధేనువు॥నోజ యనఁగ.

## ఆమ్రేడితసంధి.

మూ. సూ. ఆద్య స్యామ్రేడితే న్త్యలోప శ్చ. 21

తే. ఒక్క మాటయె రెండుమా • ట్లుచ్చరింపఁ, దానిపే రార్యు లామ్రేడితంబటండ్రు
పృథివిఁ దత్పదములలోనఁ • బ్రథమపదము, తుదిని సంధి ఘటించు న • చ్చెదిరినపుడు.

తే. అచ్చటచ్చట [1]నాడాడి • వచ్చు నొక్క
డొక్కఁ డయ్యారయారె యో • హోహో యందు
పట్టి యనఁగ నామ్రేడిత • పదము లందు
మొదలిపదములతుద సంధి • గదియుఁ గృష్ణ. 97

అనుకారసంధులు.

మూ. సూ. అహాహాదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే విసర్గస్య.

సీ. అనుకరించెడుచోట • నవ్యయాదులకొనఁ గలబొట్టుగవకు దీ • ర్ఘంబులకును
వచ్చు లోపము కేశ • వాయ తుభ్యం నమ యనఁగ రామోఘసం • వార్త యనఁగఁ
బూర్ణంబులకు నో ష్ఠ • ఘూతానునాసికశృంగంబు జడ్డను • జెంది నిలుచు
నంబుజాక్ష తవ దా • సోహ మ్మనంగను బొల్లులకును ద్విత్వ • ములు ఘటించు

ఆ. బండితోత్తములు కృ • పాసముద్రో మురజి త్తటంచుఁ జదివి • చెప్ప వినుచు
నసురవైరి విడిచి • యన్యదైవతములఁ, గొలుచుమూఢమతులు • గలరె యనఁగ. 98

వ. ఇవ్వి స్వరసంధు లనంబరఁగు నింక వ్యంజనసంధు లెట్టి వనిన. 99

అద్భుతశబ్దసంధి.

మూ. సూ. బో రద్భుతశబ్దార్థే. 23

ఆ. అద్భుతార్థవాచ • కాంధ్రశబ్దంబున, నడిమివ్రాలకొమ్ము • చెడును నిలుచు
వారి ధరించెఁ గేల • నబ్రంపుగిరి యనఁ, బ్రావె నబ్బురంపు • దప మనంగ. 100

వుకారసంధులు.

మూ. సూ. పో శ్చ తదాద్యర్థవాచకే షూతః. 24

తే. అప్పు డెప్పుడు కప్పురం • బిప్పు డనుచుఁ, బలుకుచో వీనినడిమివ్రా • లలకుఁ గలుగు
కొమ్ములుండును బోవును • గొమ్మ కప్రఁ, మప్డు గా కెప్డుమేనఁ బూ • యఁ గల దనఁగ.

లుకారసంధులు.

మూ. సూ. వికృతిపదే లో టో రపి. 25

ఆ. అవని శృంగసహిత • మగుతృతీయాంతష్షమునకు డాపలించి • తెనుఁగులందుఁ
గలటకారశృంగ • ములు పోవు నుండు ని, ట్లనియె నిట్టు లనియె • ననఁగఁ గృష్ణ.

---

1 నాడాడ (పూ. ము).

## రేఫసంధి.

మూ. సూ. ఉపధారే శ్చా వితి శ్చ లు గ్వా స్యాత్. 26

క. కడవర్ణమునకు దాపలి, కడరేఫమగుడును లుక్కు - గాంచును దనరన్
గుడిని [1]చకారము లుండెడు, నెడల వికల్పమునఁ బన్న - గేశ్వరతల్పా. 103

క. పేర్చిరి పేరిచి రరిఁ బరి, మార్చిరి పరిమారిచిరి క్ర - మంబున ధనముల్
గూర్చిరి గూరిచి రప్పు, దీర్చిరి తీరిచిరి నాఁగఁ - దెల్లం బయ్యెన్. 104

తే. మొదల రేఫాక్షరంబు వా - పిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ - జనువుకొనుచు
ముందు జడ్డయు వెస రేఫ - మునకు బసులు
గిలుక విభజించియు లిఖింతు - రిలఁ గుమతులు. 105

క. అఱఁటులఁ బఱఁటులఁ బఱెటెల, గఱెఁటెల మొఱెఁటెలను 'గలఱ - కారము తెల్లన్
ధర నెఱసున్నలు నగు నయ్యఱఁటులఁ బఱఁటులను ద్రుతము - లగువలసినచోన్. 106

## నరలడశృంగసంధులు.

మూ. సూ. పదమధ్యనరలడానా ముత శ్చ, పూర్వప్రయోగసిద్ధా
నాం లోపో వా స్యాత్. 27

క. ధరఁ బదమధ్యనరలడా, క్షరములకొమ్ములు వికల్ప - కంబున విద్యా
ధరసన్నుత లోపము లగుఁ, బురాతనకవిప్రయోగ - ములఁ గొన్నింటన్. 107

ఆ. కొన్ప తూర్పు తెల్పు - గాడ్పు కొనుఫు తూరు, పచ్చతెలుపు గాడు - పనుచు నిట్లు
కొమ్ము లడఁగు నుండుఁ - గొన్నిటఁ దొల్లింటి, వారు కావ్యములను - వాడుకలన. 108

క. [2]పద మూనుడుఁ బదరుడుఁ బొద, లుదుఁ బాడుదు ననుచు నిట్లు - లోకంబున నొ
ప్పిదము లగుకొన్ని పదములఁ, గదలవు నడికొమ్ము లాది - కవు లాడఁబడమిన్. 109

ఆ. వినుఁడు చొరుఁడు తలుఁడు - విడుఁ డనఁ పలుకులు
చిఱుతబొట్లమీఁద - జెందియునికి
సరసిజాతనేత్ర - నరలడాక్షరముల
కొమ్ము లడఁచి సంధిఁ - గూర్ప రాదు. 110

## త్రివిక్రమసంధులు.

మూ. సూ. తేషా మిత శ్చ తద్వ త్త్రివిక్రమ మతేన. 28

---

1 చికారము (పూ. ము). 2 ముద మూనుదు (ప).

ఆ. నడిమినరలడలకు • గుడు లేగు నుండును, ధరఁ ద్రివిక్రమునిమ • తమునఁ గొన్ని
పూన్కి గూర్తు కల్కి • బుడ్మి పూనికి గూరి, మనసు కలికి బుడిపి • యనుచు నిట్లు.

చ. కొలఁదిగ మున్ను చెప్పెఁ జలి • కొండన్నసింహుఁడు వెల్ల యంచు నీ
వల నగసాలరుద్ర పసు • వాఁడును మొల్క లటంచుఁ గూరిచెం
దెలియక కొంద ఱిట్లు విక్ర • తిం బదమధ్యమునన్ లకారతే
ఫలఁ దలపై యకారమును • బాపుగ హార్యులు నవ్వునట్లుగన్. 112

వ. ఇందునకు వినుకొండలోను గుంటిపల్లిభాస్కరయగారిసముఖమునందుఁ గందుకూరి రుద్రయగారు చెప్పినపద్యము. 113

చ. వెలగకు వెల్ల యంచు సర • విం జలికొండన్నసింహుఁ డాడఁగా
మొలకకు మొల్క యంచుఁ గవి • ముఖ్యుఁడు రుద్రప పల్క దోసమే
భళిభళి మంచిమాటయె ప్ర • బంధము నా జలరాశి యందులో
పల నెరసు ల్గ్రహింతురె య • పారము లౌ నణు లెల్ల నుండఁగన్. 114

కవిభల్లటమతసంధులు.

మూ.సూ. కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోర్లోప ఇష్యతే హ్యేషు,
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నానాదయోః కథ్యతే. 29

తే. ధాతుపదములకడపటఁ • దనరు రేఫ, శృంగములకు లోపంబులు • చెల్లుచుండు
నిల్లు పైకొన్నచోఁ గవి • భల్లటార్య, మతమున వికల్పనంబునఁ • బరఁగగమన. 115

తే. సర్వగతుఁ డని హరి నెన్ను • దు ర్విబుధులు
పరమపురుషుని గాఁ దలం • తురు తపసులు
[1]శ్రుతిమయుం డని చెప్పుదు • ర్భ్రామికురులు
బ్రహ్మ మనుచు నెఱుంగ లే • రనుజవరులు. 116

సీ. భల్లటవిరచిత • ఫక్కిలో సూత్రంబులవలనను వైపొల్లు • నిలుచునపుడు
ప్రథమైకవచనము • ల్పలికెడుచోటను సమసనములు గూర్పు • సమయమునను
దెనుఁగునామంబుల • కొనల నుండెడునరలడలకొమ్ములు వికల్పంబువలనఁ
గాంచును లోపము • లన్నూనెఁ గనుమూనె గోర్నాటెఁ జెక్కిట • గోరు నాటె

తే. మురుఁడు వివ్వానె విలు పూనె • మధుఁడు జాతి
ననల వీడ్కొనియెను వీడు • కొనియె ననఁగ
సాయపాన్వయవేంకట • కృష్ణపదత
తా మెపల్క్యుగ్రహారన • గర్యధీశ. 117

1 శ్రుతిమయుఁడని చెప్పుదు ర్భాగ్యురులనతని (పూ.ము).

తే. కాంతచన్గవ చనుగవ ♦ కార్మెఱుపులు
కాఱుమెఱుపులు వాల్గంటి♦కలికి వాలు
[1]గంటి చెడ్పాటు చెడుపాటు ♦ గాంచె ననుచుఁ
దెలుఁగుసమసనముల నిట్లు ♦ పలుక వచ్చు. 118

తే. చట్టుతాతికిఁ జట్రాయి♦గట్టుపేని, పట్టి యనుచోట గఱ్ఱి ని♦పట్టి యనుచు
సమసనములటకారశ్పం♦గములు నడఁగు, నాదిశబ్దంబు సూత్రంబు♦నందుఁ గలిమి.

## ఔపవిభక్తికములు.

మూ.సూ. ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింష్ట్యాదయో భవన్తి
హ, రుల్వాదే ర్నామ్నాం స్యు స్తే హి విభక్తౌ సమాసే చ.

సీ. అవిభక్తికము లగు♦నాంధ్రనామములందుఁ బ్రథమావిభక్త్యేక♦భాషణముల
కొన నుండురుల్వాదు♦లను బాఱఁ ద్రోలి విభక్తులందును సమా♦సోక్తులందు
నవని నాదేశంబు ♦ లగుచుఁ డింట్యాద్యక్షరంబులు నిలుచుప♦దంబు లెల్ల
నౌపవిభక్తికా♦హ్వాయము లై కృతులను బహువిభక్తులను జా♦పట్టుచుండు
తే. నిపుడు చెప్పినరుల్వాది♦లిపులు కొన్ని, యందు నాదేశములు లేక♦యప్పటట్లు
సమసనవిభక్తులను రెంట♦నమరనేని, యవియు నౌపవిభక్తికా♦హ్వాయము లయ్యె.

సీ. రలవర్ణములశృంగ♦ములకును గుడులకు దాలకొమ్ములకును ♦ టీలు వచ్చు
నీటికి [2]దాఁకపం♦దిటికిఁ దోఁడేటి కంబటికిఁ గూటికి గుడి♦పాటి కనఁగ
జడ్డలు గలవలా♦క్షరశృంగములకును గొన్నిమాటలకు లా♦గుడుసులకును
గట్టిబొట్టులకుడి♦కడ డుకారములకుఁ బూర్ణయుక్తంబు లై ♦ పొందుఁ డీలు
తే. చంటి కింటికి గొంగు♦ద్దంటి కఱఁటి
పంటికిఁ దుపాకిగుఁటికి ♦ రెంటి కనఁగ
*యిఱ్ఱులకుఁ డిఱ్ఱు లగునూతి ♦ కేటిమిఱ్ఱి
కనఁగ షష్ఠిని గొన్నింటి ♦ కమరు నిట్లు. 121

---

1 గంటి చేడ్పాటు చేడుపాటు ♦ గాంచెననుచు(పూ. ము); రెండును ఛందోభంగములని తెలియఁజేయుచిహ్నము కలదు. 2 డాక (ప. ఓ).

* నీటులకు (పూ. ము); 'నూయి' శబ్దము యొక్క 'యి' కారమునకు 'తి' రాగా 'నూతికి' అగును. 'ఎిఱ్ఱు' శబ్దముయొక్క 'ఱు'కారమునకు 'త్రి' రాగా 'ఏటిమిత్రి' అగును. కాబట్టి 'యిఱ్ఱులకు' అనియుండవలయును గాని 'నీటులకు' అనుట తప్పు.

సీ. పాలేటికాలువ ♦ పందిటిగుంజ తాఁబేటినో రంబటి♦పిండికుండ
కాటిపాపఁడు [1]జుంటి♦గడ్డ యింటిమగండు గొడ్డంటినరుకుడు♦గుంటికోవి
ముంజేతికంకణం♦బులు చేఁతిసారకాయ కొత్తిపీఁడు పెద్ద♦గొత్తిచెక్క
నాఁపజొన్నలు కజె♦వేఁపపూవులదండ లలపాఁపమేతరి♦యుంపములకు
తే. [2]ఇనుపపెనమునఁ బోసిన♦మినుపదోసె
లనుపపప్పును జొక్కుంపు♦టెనుపనేయి
యనుచు నిట్లు సమాసంబు♦లందుఁ గొన్ని
పలుకులను నిల్పు నాపవి♦భక్తికములు. 122

అనాపవిభక్తికములు.

సీ. దూయ [3]పేరుబిడాయ♦తొలకరి ప్రుల్లరి చాలుపాలు రవాలు♦జగిలి మొగలి
యీఁడు జోడును గీడు♦నెన్ను పన్నును [4]చెన్ను కల్లు జల్లును పొల్లు♦గాలి జాలి
చెండు దిండును దండు♦చేదోయి ప్రాయి వేయి సాను [5]వేదూదేదు♦గేదెముల్లు
గీము తొల్లిటిబాము♦మోము పున్నమనోము కొమ్మిమ్ము తలదిమ్ము ♦ అమ్ము సొమ్ము
తే. మనుము మొదలగువికృతినా♦మంబు లొక్క
కొన్నితుదల రుల్వాదులఁ ♦ గూడుకొనియు
లలి విభక్తులను సమాస♦ములను రెంట
భువి ననాపవిభక్తికం♦బు లగుచుండు. 123

మువిభక్తిలోపము.

మూ. సూ. ప్రథమావిభక్తికమో ర్బిందు శ్చ వాహో స్వతిక్రి యార్థేతు. 31

తే. పడియె నను క్రియతుద నిల్పఁ ♦ బడియెడు నెడఁ
బ్రథమ యగుమాకు సమసన♦పదమునందుఁ
బెలుచ నాదేశ మగుఁ బూర్ణ♦బిందు వదియు
లోపమును జెందును వికల్ప♦రూపములను. 124

క. పడఁతి ప్రియంపడియె భయం, పడియె సుఖంపడియె సంభ్ర♦మంపడియెఁ బదం
పడియెఁ బ్రియపడియెఁగడుభయ,పడియెరమించి సుఖపడియె♦భ్రమపడియె ననఁ.
తే. భ్రాంతిపడి చింతపడి యను♦పట్లఁ బెద్ద
సున్న గలుగదు కొనను మా♦సున్న యగుట

1 బోటికాల్వ (పూ. ము; ప.). 2 లినుప (పూ. ము). 3 పెను (పూ. ము).
4 వెన్ను (ఓ). 5 లేమూ (పూ. ము).

బలము పడియె మదేభము ♦ పడియె ననినఁ
జెడి చనదు మా సమాసంబు ♦ నుడుగు గామి. 126

పువర్ణాదేశము.

మూ. సూ. తస్య సమాసే పుంపూ. 32

క. ఆదివిభక్తిము కారము, యాదవవర కర్మధారయసమాసమునన్
మేదినిపైఁ జెందుఁ బువ, ర్ణాదేశం బది సబిందు ♦ వగు వలసినచోన్. 127

తే. పడఁతి యబ్రపుటూరు లబ్రంపుటూరు, లతివచోద్యపుటూరు చోద్యంపుటూరు
మగువసూక్ష్మపుఁగౌను సూక్ష్మంపుఁగౌను, కలికిచొక్కపుమేను చొక్కంపుమేను.

అథర్వణమతసంధులు.

మూ. సూ. నుస్త్రీతో మహల్యాధర్వణాచార్యమతాత్. 33

తే. సమసనమున నామాంతశబ్దంగములకెల్ల, హల్లు గదియ స్వార్థంబునఁ బొల్లుద్రుతము
వికృతి నాగమమై ద్రుత ప్రకృతిపగిదిఁ, గాంచు సంధి నథర్వణకవిమతమున.

క. చనుగవసుఁ జనుంగవ యనఁ, దనసుఁ దలిరుజొంపమునసుఁ ♦ దలిరుంజొంపం
బన నచ్చు నసుఁగు వెలఁదికి, నసుఁగు స్వేలది యన శిష్ట ♦ మగు స్థిరపరతన్. 130

పదమధ్యద్రుతలోపబింద్వాదేశములు.

మూ. సూ. శత్రన్తేతూంత శ్చానో స్తస్యస్యాచ్చ పూర్ణబిందురపి.

ఆ. తెలుఁగున శత్రర్థమానములపదంబు, కొమ్ముపిఱుఁద ద్రుతము కొమ్మ మరినఁ
గొమ్ము లోప మగు ద్రుతమ్ము పూర్ణం బగు, క్షమను గొన్నిటను వికల్పమునను.

క. చనుచును బూనుచు నెన్నును, ననుకొన్నిటఁ దక్కనంచు ♦ ననుచును వించున్
వినుచును గనుగొంచును గను, గొనుచును దించుఁ దిను చనఁగఁ ♦ గూడునుగృతులన్.

తే. ధాతుపదములనడుమను ♦ దటలపిఱుఁద
వెలయు ద్రుతములు స్వరసమన్వితము లగుచుఁ
దొలఁగి తమచోటఁ బూర్ణబిందువులు [1]నిలుచుఁ
గొన్నిటను గనుగొందుఁ జేకొంటి ననఁగ. 133

ప్రథమైకవచనద్రుతప్రకృతులు.

మూ. సూ. షాత్తా స్తదో ర్ద్రుతస్య స్యాల్లుక్. 35

క. శ్యామాంగ నేను దా నను, నీమాటలకొన ద్రుతంబు ♦ లేగ నిలుచు హ
ల్లామీఁద నుండునప్పుడు, నే మనుచును నేను మనుదు ♦ నీకృప ననఁగన్. 134

1 నిలుపు (పూ. ము).

తే. తాను నే ననుపలుకుల • లోని ద్రుతము, లడఁగుచో మీఁదఁబరుషంబు • లసురదమన
సరళలిపు లగుఁ దద్ధ్రితా • క్షరము లర్థ, బిందు లగుఁ దాఁజనంగ నేఁ • [1]బిలిచితనఁగ.

పదాంత ద్రుతలోపము.

మూ. సూ. వాక్యాన్తగతపదానాం చ. 36

క. పస గలసీసాదికముల, వసుమతి నొక్కొక్క పదము • వాక్య మనంగా
నెసఁగుఁ దదంత్యపదముతుదఁ, బొసఁగునకారంబు పొల్లు • పోవు న్నిలుచున్. 136

తే. దానవారాతికేళికో • ద్యానసీమ, నాకభూజంబుచెంతఁ గాం • తాలలామ
ననఘుగుణధామ సత్యభా • మను బెరిమను, గలయు నిచ్చలు ననఁగ లం • క్ష్యంబులయ్యె.

పదాంతప్రాణలోపము.

క. నాంతపదాంత ద్రుతమున, కెంతయుఁ బ్రథమాబహూక్తి • కేతెంచుతృతీ
యాంతస్థంబునకుం బ,ద్యాంతంబున స్వరము లోప • మగుఁ గొన్నింటన్. 138

క. నలినాక్ష తెలుఁగుపద్యం,బులకడపల నుండునలల • పొల్లులకు మహీ
స్థలి గుడుసులు శృంగములును, నిలుపరు చదువునెడ లాక్ష • ణికు లెచ్చోటన్. 139

ద్రుతప్రకృతికాంతబిందుసరళాదేశము.

మూ. సూ. పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ధ్రితం
చ బిన్దు స్స్యాత్. 37

సీ. ధర ద్రుతప్రకృతిశ • బ్దంబులపైఁ బరుషంబులు [2]సెడి సర • ళంబు లగును
ద్రుతములు ఖండబిం • దువు లగు నాపట్ల గాధేయముని వెంటఁ • గదలి నడచెఁ
జరణపంకజధూళిఁ • జట్టు నాతిగఁ జేసె వెసఁ డొక్క మనకుండ • విల్లు విఱిచె
ధాత్రీతనూభవఁ • దగ వివాహం బయ్యె గురువైభవంబునఁ • బురికి వచ్చె

ఆ. నినకులేంద్రుఁ డనఁగ • నివి యుదాహరణంబు, లిట్టిచిన్నిసున్న • లెల్లఁ గుఱుచ
లిపులమీఁద నుండు • నపుడు గొప్పలు నగుఁ, గడమవ్రాలమీఁదఁ • గావుగాని. 140

ఆ. ముంగమురువు దాలి • చెం గాంత యన నిట్లు, గొప్పసున్న లగును • గుఱుచమీఁద
రాజె నగ్ని గాలి • చేఁ జాల నన నిట్లు, నిడుదమీఁదఁ గావు • నిండుబొట్లు. 141

ద్రుతప్రకృత్యంతసరళాదేశము.

మూ. సూ. అవికారగతే తస్మి న్నపి సరళా ఏవ స న్తి తే పరతః. 38

సీ. అవని ద్రుతప్రకృ • త్యంత ద్రుతంబులు చెడి బిందువులు గాని • మొదల వాని
వలపలిపరుషము • ల్వరుసతో సరళంబు లవుఁగాని యచట బిం • దువులు లేవు

---

1 బిలిచితి నన (ప). 2 నిజసరళంబు (పూ. ము; ఓ.).

తండ్రి పంపునను గాం♦తారంబునకు నేఁగి సమదవిరాధుని♦జావ మొత్తె
నతివతోడను డేకు♦టాకుటింట వసించెఁ గనకమృగంబును ♦ దునిమివైచె
తే. భామినిని బట్టుకొనిపోవు♦పఙ్క్తికంఠు
నంతకునిఁ జేర్చెఁ బుత్రమి♦త్రాన్వితముగ
నగరమునకు మహీజాత♦ను గొనివచ్చె
రాముఁ డర్కకులాంబుధి♦సోముఁ డనఁగ. 142

## ద్రుతప్రకృతికాంత ద్రుతలోపము.

మూ. సూ. లు గ్వా ద్రుతప్రకృతికా త్పరత స్సరళే స్థిరే చ న
స్య స్యాత్. 39

సీసమాలిక. సరళంబులును స్థిరా♦క్షరచయంబును ద్రుతప్రకృతిశబ్దంబుల♦పైని గదియు
నపుడు తదంత ద్రు♦తాక్షరంబులు వికల్పమున లోపంబులై ♦ పరఁగుచుండు
జనియించె గరుడకే♦తనుఁడు దేవకియందుఁ బెరిగెను గోపికి ♦ బిడ్డఁ డనఁగ
నతినుతిఁ గాంచె జం♦భారిముఖ్యులచేతఁ బూతనను జయించెఁ ♦ బురిటిలోన
ననుపమస్థితి నొంద♦మున భీతి నొందక చంపెను డింభుఁడై ♦ శకటదైత్యు
నడఁచె దుష్టాత్ముఁ దృ♦ణావర్తు మెడఁ బట్టి తిగిచి వ్రేపల్లెను ♦ దిక్కు లద్రువ
గర్గుచే బహునామ♦కములు గాంచెను నెఱపెను బాలలీలలఁ ♦ బెక్కుగతులఁ
బొడచూపె ఖేచర♦భూచరావలిఁ దల్లి కౌననంబునను ఖ♦గాలి మెచ్చఁ
గదలె ఘోషాంగనా♦సదనంబులకు వెన్న మ్రుచ్చిలియెను గంట♦ మ్రోఁగ కుండఁ
జేసె ఛిద్రంబులు ♦ క్షీరభాండంబులఁ బలికెను ఛలవాక్య♦ములు వనితలఁ
బడవైచె ఝంపాప్ర♦భంజనుం డన మద్దు లరిగెను ఘల్లీర♦వాటవికిని
వదలక కాచె లే♦వలు మీఱఁ గ్రేపుల గోపకులను లీవిఁ ♦ గూడి మాడి
తునిమె ధక్కుకుఁ జర్మ♦మునకు నో యన వత్సదనుజుని ఢాకతోఁ ♦ దలక కుండ
నిర్జించె ధీరుఁడై ♦ నిలిచి బకాసురు నసుని ధాత్రిని గూల్చె ♦ నద్భుతముగఁ
గల్పించె విరజ♦గర్భుండు డాచిన వలను మీఱఁగ నూత్న♦వత్సములను
క్రీడించె ఫలితశా♦ఖిచ్ఛాయలను పాళిఁ జుట్టెను ఫుల్లప్ర♦సూనమాల
నవలీల భంజించె ♦ నావులఁ గాయుచు గర్దభాసురుని భీ♦కరశరీరుఁ
గాలియు మర్దించి ♦ కాళింది వెడలించెఁ ద్రావెను మండెడు♦దావవహ్ని
సరసి యాదఃకేళి ♦ సలుపుచుండంగఁ జేకొనియెను యువతుల♦కోక లెల్ల
భుజియించె రుచికగం♦బుగ విప్రవనితలచేతను రాజాన్న♦జాత మెలమి
రక్షించె శేఖభ♦ర్త నులింప నెల్లర హస్తంబునను లీల ♦ నచల మెత్తి

శరమున వరుణకిం♦కరుఁ డెత్తికొనిపోవునందుని వెదకి పం♦తమునఁ దెచ్చెఁ
దాల్చె శయాంబుజా♦తంబున వేణువు పూరించను శిరీష♦ములు చిగుర్పఁ
బాడె షడ్జస్వర♦ప్రభవగీతంబు విరాలిఁ బెట్టెను షట్ప♦దాలకలను
జలమున సుందరీ♦జనములఁ గికురించి చనియెను సూనవృ♦క్షములనడుమఁ

తే. గరుణ హేమాంబరంబులోఁ♦గానవచ్చి, మాన మెల్లను హరియించి ♦ మరునికేళి
వారి నెల్లను దేల్చెను ♦ వరుసకొలఁది, నన ద్రుతప్రకృతుల కుదా♦హరణము లగు.

తే. ధేనుపాల తవర్గద్వి♦తీయ మొకఁడు, మొదలియనునానికంబులు ♦ మూఁడులిపులు
నాంధ్రసంస్కృతశబ్దాదు♦లందు లేమిఁ, జేసి వానికి లక్ష్యము ♦ జెప్ప నైతి. 144

## ద్రుతప్రకృతికాంత ద్రుతశ్లేషము.

మూ. సూ. అటుకి ప సంశ్లేష స్స్యాత్. 40

క. లలి సరళస్థిరములడా, పలినాంతపదంబు లూఁది♦పలికెడుచో సం
ధులు గాంచును డతవర్గం, బులు నాటిటిచెంతఁ దక్కుఁ ♦ బొల్లు లయి హరీ. 145

క. టతవర్గంబులు రెంటను, సతతము సరళాక్షరములు ♦ సమలిపులును ని
ర్జితమురనాంతపదాంత, ద్రుతములనుం గూడుకొనవు ♦ తుదిఁ గదిసినచోన్. 146

## మాలినీవృత్తము.

నలువఁ గనినవేల్పు ♦ న్గంధవాహాదతల్పు
న్నలకలిభయహర్త ♦ జ్జాంబవత్యాత్మభర్త
న్నలినదళసమాక్షు ♦ న్బాణదైత్యేంద్రశిక్షుం
దలఁతు వనఁగ జెందుం ♦ దన్నుకొరంబు లెందున్. 147

## మహాస్రగ్ధర.

నవఁత ల్పాయం దలంతు ♦ న్ఖగపతిగమను ♦ న్ఛత్రచిత్రధ్వజాంకు
న్నవకందర్పావతారు ♦ న్ఫణిపతిశయను ♦ న్ఖస్రనాథేందునేత్రు
న్నవరత్నాంచత్కిరీటు ♦ న్ఝషపదజనకు ♦ న్భర్మవస్త్రాపిధాను
న్నవనీతక్షీరచోరు ♦ న్నతజనకులభు ♦ న్మానివ్యాత్పద్మవాసున్. 148

## సరకపుష్పిణీవృత్తము.

నరకభయసంహరు ♦ న్యాదవాగ్రేసరు
న్నరకదనుజాంతకు ♦ న్రోహిణేయానుజు
న్నరముఖసురార్చితు ♦ న్లక్ష్మణావల్లభు
న్నరహరిఁ దలంచెద ♦ న్వాంఛితార్థాప్తికిన్. 149

### స్రగ్విణీవృత్తము.

నీరజాతేక్షణు ♦ న్శేషసింహాసను, న్నారదాదిస్తుతు ♦ న్షట్పదశ్యాములు
న్నారకాపద్ధరు ♦ న్సామజేంద్రావను, న్నే రహస్యంబున ♦ న్స్వాగ్రదగతుం జేసెదన్.

### ద్రుతప్రకృతికాంతబింద్వాదేశము.

మూ. సూ. బిన్దుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్. 41

తే. కడుఁ దృతీయచతుర్థవ♦ర్గములు గలుగు, సరళములు సమలిఫులును ♦ బరము లైన
తటిని నాంతపదాంతద్రు♦తంబుపొల్ల, భెటికి యై నిత్యముగఁ బూర్ణ♦బిందు వగును.

క. నన్నయనూత్రమునఁ గ్వచి, త్తన్న దొకటిఁ దక్క బొట్లు ♦ కక్షరనియమం
బెన్నట లే దాదికవుల్, గొన్ని తెలుఁగు లరసి తెలిసి♦కొంటిని వీనిన్. 152

అవి యెయ్యవి యనినఁ దృతీయవర్గసరళంబునకు రాచమల్లువారిషష్ఠస్కంధములోను ప్రయోగము చతుర్థవర్గసరళంబునకు రాఘవపాండవీయములోను భారతార్థము నందు పింగలిసూరపరాజుప్రయోగము టవర్గద్వితీయమునకు త్రైశంకవోపాఖ్యానములోను కవిసింగరన్నప్రయోగము. 153

క. డుంఠిశు భైరవుని నితి, కంఠు విశాలాక్షి దండ♦కరు జాహ్నవి పై
కుంఠపతి గుహుని లోలార్కుం శేవలు మీఱ భూవ♦రుఁడు పొడగనియెన్. 154

టవర్గచతుర్థంబునకు అథర్వణాచార్యులవి రాటవర్వమునందు:—

తే. ధాంధమితభేరికాధ్వాన♦[1]ముం ధుళీని, నాదమును మిన్ను ముట్ట న♦నారతంబు
పెక్కుగంధర్వపతులు న♦ల్దిక్కులందుఁ, గామసౌగంధికంబుఁ దేఁ♦గలరె యొరులు.

తవర్గంబునందు ద్వితీయవర్ణము సంస్కృతాంధ్రశబ్దాదులందులేదుగానఁ బ్రయోగంబు గలుగ నేరదు చతుర్థాక్షరంబునకు అనంతునిఛందము నందు:—

తే. పేర్చి పొల్లనకారంబు ♦ బిందు వగుచు
మీఁద నున్నధకారంబు ♦ నూఁది ప్రాస
బంధ మగుఁ గృష్ణుఁ డుదయించి♦నం ధరిత్రి
యంతయును నిరుపద్రవం ♦ బయ్యె ననఁగ. 156

క. ముందర గజబమకారము, లొందిననాంతములతుదల ♦ నుండుద్రుతములం
గ్రందుకొని వికల్పంబున, బిందువులుగఁ జేసి కృతులఁ ♦ బెట్టుదు రొకచోన్.

సీ. అంగజకేళిఁ దే♦ల్చెం గోపకాంతల నగము హస్తంబున ♦ నగిమఁ దాల్చెఁ
[2]గుంజి భోజధరావ♦రుం జముకడఁ జేర్చె నరుఁ బ్రోచె రణమున ♦ నజగ మెఱుంగ

1 మాంధు వీని (పూ. ము.). 2 గెంజి (పూ. ము.); గ్రుంజి (ఓ.).

జాంబవంతుని గెలిచెం బంటుతనమున నతికేఁ జక్రంబున ♦ న్బాణుపాణు
లమ్మకుఁడలమా లిచ్చెం మహీసుతుఁ జంపి నాఁటె భూతలమున ♦ న్నఘువతరువు

తే. దైవమాత్రంబె దేవకీ♦దేవిపట్టి, దేవదేవుఁడు శ్రీవాసు♦దేవుఁ డనఁగ
గజబమంబులఁడాపలఁ ♦ గదియునట్టి, నాంతపదములఁ కెల్ల ల♦క్ష్యంబు లయ్యె. 158

### నకారద్విత్వమైత్రము.

తే. తమకుఁ దాము ద్విత్వంబులై ♦ యమరునవియు
బిందువులు డాపలను వెలుఁ♦గొందు నవియు
నొక్కరూపయి పూర్వప్ర♦యోగసరణి
నములు ప్రాసంబులకు నిల్చుఁ ♦ దమకుఁ దామ. 159

క. మిన్నేఱు పాదమున ధాత న్నాభిని గుసుమశరు నె♦దం గాంచినని
సాన్నిధ్యము దొరకుటకై, సన్నుతి సేయుదురు నిన్ను ♦ సనకాదు లజా. 160

క. తమ్ములను మల్లికొకుసు, మమ్ముల మరువాదిపత్ర♦మాలికలను భ
క్తి మ్మురసంహరుపూజలు, సమ్మదమున సలుపఁ గలుగు ♦ సకలార్థంబుల్. 161

### పదాంతనులుకారద్విత్వలోపములు.

మూ. సూ. ప్రథమ లుగపి ద్విత్వలోపః. 42

క. సమయును వికల్పకంబున, శమితదనుజ తమకుఁ దాము ♦ జడ్డ లయి పదాం
తముల వెలింగెడినులుపూర్ణములను ప్రథమాక్షరములు ♦ రాజీవాక్షా. 162

తే. కన్ను మూసెను గను మూసెఁ ♦ జన్నుదోయి
గబ్బిచనుదోయి మిన్నువాఁ♦క మినువాఁక
ముల్లు నాటెను ములు నాటెఁ ♦ బల్లుగంటి
తరుణి పలుగంటి కల్లుముం♦త కలుముంత. 163

### ద్రుతలోపసమాసములు.

మూ. సూ. ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. 43

తే. పనధితనయేశ యయినటు♦వంటి యనుచుఁ
బరపదవిశేషణము తేట♦పఱుచుకొనుచుఁ
దొలుతటిపదంబుకొన నుండు♦ ద్రుతము గూడియు
సమసనమునందుఁ జెందు లో♦పములు కృతుల. 164

క. కడపలి ద్రుతమును గూడియును, బొడ నడఁగినఁ బయిని బరుష♦ములు సరళము లౌఁ
జెడవు పెఱవాల్లు లెల్లను, సడలక ప్రాణంబు లెల్ల ♦ సంధులు గాచుఁగా. 165

తే. జగతిఁ జప్పనికూరకుఁ • జప్పగూర, చనును జక్కనిచాయకుఁ • జక్కజాయ
హెచ్చు[1]పచ్చనిటోపికిఁ • బచ్చడోఁపి, గరిమఁ గమ్మనితావికిఁ • గమ్మదావి. 166

ఆ. చల్లగాలి తీయ • విల్లు నా సరళస్థి, రాక్షరములు తొల్లి • టట్ల నిలుచుఁ
బంచబాణజనక • పచ్చావు నల్లావు, లనుచు నచ్చు లెల్ల • నదుకు నిట్లు. 167

## హేమాచార్యమతసంధులు.

మూ. సూ. హేమోక్తేః పరుషాణాం గసడదవా స్స్యుః పదాత్ ద్వన్ద్వే. 44

క. సుమనఃస్తుత ద్వంద్వసమా,సములను హేమోక్తిని బర•శబ్దాదిమవ
ర్ణము లగుపరుషాక్షరములు, తమరూపులు విడిచి గసడ•దవ లగు వరుసన్. 168

ఆ. కసవుగట్టెలనఁగఁ • గాలుసేతు లనంగ, నిక్కు డెక్కు లితఁడు • నేరఁ డనఁగ
నొప్పుదప్పు లనఁగ • నూరుపల్లె లనంగ, జరుగు నిట్లు ద్వంద్వ•సమసనమున. 169

## ప్రథమాంతగసడదవాదేశము.

మూ. సూ. గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాఖ్యాన్తదో ర్వినాపరుషాః. 45

సీ. శుకమునిస్తుత ద్రుత• ప్రకృతు లౌ నేను దా ననురెండు దక్కంగ•నవనిఁ గలుగు
ప్రథమావిభక్తుల • పైని దత్తుల్యశబ్దములమీఁదను గను•పట్టు నాంధ్ర
శబ్దాదిగతపరు•షంబు లేనింటికిఁ గ్రమము దప్పక వచ్చు • గసడదవలు
సిరి గలిగినవాఁడు • పురుషుండు సెలరేఁగి నిక్కంబు డెక్కలు • సెరపుఁ గాని

తే. ప్రియము దఱు గొత్త నరికిఁ • బెట్ట లేఁడు
కలిమి వోయిన సిరికిఁ • గాంక్ష సేయు
నపుడు గలుగునె తనకుఁ గా • సైన ననఁగ
నివి యుదాహరణము లయ్యె • నెన్నిచూడ. 170

మూ. సూ. న వికృతిశబ్దాత్పరత స్సంస్కృతికానాం భవన్తి గసడదవాః. 46

సీ. పరమాత్మ ప్రథమావి•భక్తులమీఁదను దత్సమాంధ్రశ•బ్దములమీఁదఁ
గలసంస్కృతపదాది•గతపరుషంబు లెల్లెడ నిజరూపము • ల్బెడక నిలుచు
గాదిలిజవరాలు • కమలనివాసిని చిఱుతముద్దులపట్టి • చిత్తజాతుఁ
డనుఁగుఁజుట్టంబు టం•కాయుధవాస్తుండు మక్కువమఱఁది తా•మరసవైరి

1 పచ్చనితోఁటకుఁ బచ్చదోఁట (పూ. మ); పచ్చనిటోఁపికిఁబచ్చడోఁపి (ఓ); పచ్చనిపోఁటికిఁ బచ్చబోఁటి (ప).

తే. నిక్కమర్థిలి మామ పానియరాశి, యరసి చూడంగ నెవ్వని కట్టివేల్పు
వాఁడు కరుణించి నాకు స్వప్నమున వచ్చి, తెనుఁగు గావింపు మనియెను దీనినన(ఁగ)

కల్పితకల్పవల్లీసమానలక్షణసీసమాలిక.

[1]పంచదశవిధాంధ్రపద్యగర్భితములై కరధృతకరుహాముఖ్యంబు లగుచుఁ
బరఁగు ద్వితీయవిభక్త్యేకవచనాంతసంస్కృతభాషాష్టసమసనములు
వాని కధ్యాహార్యమైనామి యనుధాతుపదము పైకొనునభిప్రాయములకు
సమసనాంతస్థితాక్షరములపైఁ గలలలకట్టులకు శృంగములు ఘటించి
బొట్టులవలపలఁ బొదలువర్గాద్యక్షరము లెల్లఁ దత్స్థానములు చేసి
యాదివర్గద్వితీయములదాపల నుండుపూర్ణంబులకుఁ బద్యములకుఁ దుదిని
దనరుసున్నలును బొల్లనకారములఁ జేసి పఠియింప నగునాంధ్రపద్యవితతి
తరువాతఁ గందపద్యముతోడఁ గలకమై తలచూపు దానికి ధాతుపదము
మదనవిలసితయుగ్మం బయ్యెఁ బసపదంబునకు సప్తాక్షరంబులుగఁ జదువ
నిపుడు చెప్పినవృత్తమే యంగవిధులచే మధుమతిన్యాత్తనామంబు గాంచుఁ
బాదపాదమునకుఁ బసునాల్గువర్ణము ల్గావింపఁ బ్రహరణకలిత మయ్యెఁ
దొలుతటిసమసనంబుల ద్రుతప్రకృతులైపై నొక్కసమసనపదముఁ గూడి
[2]పంచదశాక్షరోదంచితపదములై మణిగణనికరసమాఖ్యఁ జెందు
నష్టమాత్రావృత్తియమళి మయ్యె ద్రుతాంతసమసనం బొక్కొక్కచరణమైన
నాంతసమాసద్వయం బొక్కపాదమై రగడలలో మధురగతియు నగుఁ
దలపోయ నిటుల వ్యత్యయలేఖనక్రమవిధులు షోడశలఘువృత్తమంద్రు
ద్విపదపాదం బయ్యె దీనికిఁ గడపలఁ జూపట్టు ద్రుత మరసున్నయైన
వెస ద్రుతాంతంబులై నసమాసములు నాల్గు హరిగతి కేకాంఘ్రియై తనర్చు
వేమఱు కడపల వెలయు సమాసంబు మొదలుగాఁ దుదయును మొదలు గలయఁ
జదువువేళఁ దృతీయసప్తమసమసనచరమబిందువులు ద్రుతాక్షరములైనఁ
గనుపట్టు నెనిమిది కందపద్యంబులు గణయతిప్రాసము ల్కడమ గాక
తే. నిట్టిగర్భకవిత్వంబు లెఱిఁగి నీకుఁ, గవిత రచియించు వానిభాగ్యంబు వొగడ
నమరనేతకు ధాతకునైనఁ దరమె, [3]సవ్యాభూ(జా)దక్షిణైకయోజనని వేళ. 172

అవతారిక.

అథేదానీం కౌతుకానార్యప్పకవివర్యః పంచదశాన్ధ్రపద్యగర్భితాష్టసమాసా
ప్రహరణకలితవృత్తేన సంగృహ్ణాతి.

1 పంచాదశ (ఓ. ప; పూ. మ). 2 పంచాశద (పూ. మ). 3 సవ్యామీ (పూ. మ).

కరధృతకరుహం ♦ కరిహితకరణం, కరుహసఖరుచిం ♦ గరుడఖగరథమ్
ఖరఘనకరవిం ♦ ఖరతరకరగం, గరళముఖరిపుం ♦ గరధరకరతమ్. 173

టీక. బాలానాం మందబుద్ధీనాం సుఖావబోధార్థ మేత దష్టసమాసాంతర్గత శబ్దానాం క్రమేణార్థం దర్శయతి ప్రపంచయతి-కరధృతకరుహం కం జలం కం శిరోంబునో రితి నానార్థాభిధానాత్-కే జలే రుహతి ప్రాదుర్భవతీతి - కరుహ మబ్జం శంఖ మితి యావత్_రుహ బీజచర్మణః ప్రాదుర్భావ ఇతి ధాతుః కరో హస్తః బలిహస్తాంశవః కరా ఇత్యమరః_కరేణ ధృతం కరుహం శంఖం యేన తం కరధృతకరుహం శంఖ ధారిణ మిత్యర్థః యద్వా కరేణ హస్తేన ధృతం కరుహ మంబుజం యేన తం కరధృతక రుహం పద్మస్యాంభోరుహత్వేన కరుహత్వస్య వక్తుం శక్యత్వాత్ తథాచ హస్తధృ తాంభోరుహ మిత్యర్థః శంఖచక్రగదాపద్మధారిణం వనమాలిన మితి ధ్యానాన్త రప్రసిద్ధేః. 1

కరిహితకరణం కరో హస్తో స్యాస్తీతి కరీ మతంగజః కుంజరో వారణః కరీత్యమరః-కరిణో హితం మోక్షణం కరిహితం-కరిహితే కరణః సాధనభూతః-తం కరిహితకరణం- అత్ర కరణాధికరణయో రితి కరణార్థే ల్యుట్ నచాస్య ల్యుడన్తస్య పుంస్త్వం శంకనీయం నారాయణ ఇత్యాదౌ పుంస్త్వస్యాపి ప్రసిద్ధేః విశిష్యం లోకాశ్రయత్వా ల్లింగస్యేతి జనపదాదిషు పూర్వై రభిహితత్వాత్ పురా కిల పాండ్యరా డింద్రద్యుమ్నాఖ్యో రాజర్షి రగస్త్యశాపవశా ద్గజేంద్రతా మాపన్నస్సన్ కదాచి త్తృష్ణావశాద్దుగ్ధోదధిమధ్యత్రికూటచలాగ్ర వారుణోద్యానాం తరసరోవరం సమాగత్య దేవలశాపాగత గ్రాహరూపిణా హూహూగంధర్వేణ గ్రస్తః ప్రాక్తన జన్మతపోవిశేష విజ్ఞానసంపన్న స్సన్ పరమేశ్వర ముద్దిశ్య స్తోత్రం చకార వైకుంఠభవనస్థో వాసుదేవ స్తత్సమీపం ప్రాప్య మోక్షయామా సేతి సుప్రసిద్ధం భాగవతే. 2

కరుహసఖరుచిం కేజలే రుహన్తి కరుహాణ్యమ్భోజానికరుహాణ్యాంభోజాని కరుహాణాం నీరజానాం సఖాహితః కరుహసఖ స్సూర్యః అత్ర రాజాహ స్సఖిభ్య ష్టజితి టచ్ప్రత్యయః కరుహసఖస్య సూర్యస్య రుచి రివరుచి ర్యస్య తం కించ యథా భాస్వాన్ తమో నివర్తయన్ లోకం దీపయత్యేవం విష్ణు రప్యజ్ఞానరూపతమో నివర్తయన్ లోక దీపకత్వా త్తస్య భాస్కర తేజోవత్త్వం యుక్తం యద్వా కరుహాణ్యుత్పలాని తేషా మపి జలరుహత్వస్య వక్తుం శక్యత్వాత్ కరుహాణా ముత్పలానాం సఖా హితః కరుహసఖ శ్చంద్రః కరుహసఖస్య భూషణమయచంద్రస్య రుచి ర్యస్య తం బాలభావే హరిణార్ధ చంద్రాకారణభూషణధారణస్య కర్ణామృతే షూక్తత్వాత్ యద్వా 'సూర్యకోటి

ప్రతీకాశం వహ్నికోటిసమప్రభ' మితి పద్మపురాణే భగవద్ధ్యానాంతరస్య సత్వా చ్చ అస్మిన్పక్షే కరుహాసఖేత్యత్ర బహువచనతయా సమాసో జ్ఞేయః బహుత్వస్య త్రిత్వాదిసాధారణత్వాత్ అథవా కరుహాః శీర్షవగాణి తేషాం సఖా హృదయ భూతా తుల్యరూపిణీత్యర్థః-తాదృశీ రుచి ర్యస్య తం శైత్యం హి యత్నా ప్రకృ తే ర్జల స్యేత్యాదివ ద్భిన్నలింగానా మపి విశేషణవిశేష్య భావ స్సమ్పద్యతే. 3

గరుడఖగరథం-గరుడో గరుత్మాన్-గరుత్మా న్గరుడ స్తార్క్ష్య ఇత్యమరః గరుడ ఇతి ఖగః పక్షీ గరుడఖగః గరుడఖగ ఏవ రథో వాహనం యస్య తం యద్వా ఖేగ చ్ఛన్తి చరన్తీతి ఖగా ఇతి వ్యుత్పత్త్యా ఖగశబ్దస్య దేవతావాచకత్వస్యాపి వక్తుం శ క్యత్వాత్ గరుడఖగో గరుడదేవః స ఏవ రథో యస్య తం అథవా గరుడ ఏవ ఖ గరథో వ్యోమసంచారణపటూ రథో యస్య తం కించ-ఖగ స్సూర్యః శరార్క విహగాః ఖగా ఇత్యమరః సూర్యశబ్దస్య శ్రేష్ఠవాచకత్వస్యాపి వక్తుంశక్యత్వాత్ గరుడానాంపక్షిణాంశ్రేష్ఠః గరుడఖగః స ఏవ రథో యస్య తం. 4

ఖరఘనకరవిం-ఖరః ఖరాసురః ధేనుకవనవాసీగర్దభాసురః-అథవాదండకారణ్య నివాసో రావణభ్రాతా ఖరాసురః స ఏవ ఘనః మేఘః ఘనజీమూతముదిరా ఇత్య మరః కః వాయుః మారుతే వేధసి బ్రధ్నే పుంసి క ఇత్యమరః కానాం వాయూ నాం రవిః శ్రేష్ఠ శ్ఛిన్నమారుత ఇతి యావత్ ఖరఘనస్య కరవిః తం ఖరసమానఖరా సురస్య ప్రళయవాయుస్వరూపః అస్మిన్ పక్షే భాగవతరామాయణప్రసిద్ధి ర్ద్రి ష్టవ్యా. 5

ఖరతరకరగం ఖరతరా స్తీక్ష్ణతరాః తిగ్మం తీక్ష్ణం ఖరం తద్వదిత్యమరః, కరా అంశవో యస్య సః ఖరతరకర స్సూర్యః తంగచ్ఛతీతి ఖరతరకరగః తం ధ్యేయ స్సదాసవితృమణ్డలమధ్యవర్తీతి ధ్యానశ్లోక ప్రసిద్ధత్వాత్ యద్వా ఖరతరో దర్దురః కరో యస్య సః ఖరతరకరః కుంజరః స ఇవ గచ్ఛతీతి ఖరతరకరగః తం మత్త మాతంగవిక్రమమితి రామాయణే బాలకాండే వాల్మీకివచనప్రసిద్ధేః - నచాత్ర విక్రమపదస్య పరాక్రమార్థపరతాశ్రయణీయా తద్వ్యాఖ్యానే తత్పదస్య క్ర ము పాదవిక్షేపణ ఇత్యస్మాద్ధాతో ర్గమనార్థకత్వ స్యోక్తత్వాత్. 6

గరళముఖరిపుం గరళం విషం ముఖే యస్య సః గరళముఖః కాళియః తస్య రిపుః శత్రుః తం కాళియమర్దన మిత్యర్థః అత్ర భగవాన్ యమునాహ్రదస్థం కాళియాఖ్యం మహోరగం శిక్షితవా నితి పూర్వభాగవతప్రసిద్ధేః. 7

గరధరకరతం ధరతీతి ధరః డుధాఞ్ ధారణపోషణయో రితి ధాతుః గరస్య కాల కూటస్య ధరో గరధరస్సదాశివః స ఏవ గరధరకః స్వార్థేక ప్రత్యయః తస్మిన్రతం

ప్రీతిమంతం నారాయణప్రియ మనంగమదాపహార మితి స్తోత్రాత్ యద్వా కశబ్ద స్య బ్రహ్మవాచకత్వాత్ గరధరశ్చకశ్చ గరధరకౌ తయోః రతం ప్రీతిమంతం యద్యపి నారాయణస్య సర్వసమత్వ మేవ వక్తవ్యం తథాచ లౌకికసామ్యాత్పురాణ ప్రసిద్ధేశ్చ తద్వ దుక్తి రితి జ్ఞేయమ్ అత్ర నామిత్యాధ్యాహారేణ తథావిధం గోపాలం నామిత్యర్థః యద్వా గరధరకరక మిత్యత్ర గరేతి ధరేతి కరత మితి పదత్రయం ద్రష్టవ్యం తథాచ హేగర విష స్వరూపపాపిష్ఠేతి యావత్ కే బ్రహ్మణి రతం ప్రీతిమంతం పూర్వోక్తవిధం శేషం ధర హృది ధ్యాయస్వే త్యర్థః అత్ర కృష్ణస్య గరుడఖగరథమితి విశేషణాన్వయసామర్థ్యా త్తద్భజనేనాస్య పాపశోధో భవిష్యతీతి తదుక్తిరితి జ్ఞేయమ్. 8

వ. సప్తాక్షరైకపాదంబైన గర్భమునవిలసిల్లువృత్తద్వయము.

కరధృతకరుహులన్, గరిహితకరణులన్, గరుహాసఖరుచిన్, గరుడఖగరథున్. 176

గర్భద్వితీయమునవిలసిల్లువృత్తము.

ఖరఘనకరవిన్, ఖరతరకరగున్, గరళముఖరిపున్, గరధరకరతున్. 177

వ. కొంద ఱీరెండువృత్తములు మనసుతీవృత్త మందురు.

చతుర్దశాక్షరైకపాదంబైనగర్భ ప్రహరణకలికావృత్తము.

కరధృతకరుహులన్ ♦ గరిహితకరణులన్, గరుహాసఖరుచిన్ ♦ గరుడఖగరథున్
కరఘనకరవిన్ ♦ ఖరతరకరగున్, గరళముఖరిపున్ ♦ గరధరకరతున్. 178

పంచదశాక్షరైకపాదంబైనగర్భము మణిగణనికరవృత్తము.

కరధృతకరుహులని, గరిహితకరణులన్, గరుహాసఖరుచిని, గరుడఖగరథున్
ఖరఘనకరవిని ♦ ఖరతరకరగున్, గరళముఖరిపుని ♦ గరుడఖగరథున్. 179

అష్టాక్షరైకపాదంబైనయనుష్టుప్పాత్రావృత్తద్వయము.

కరధృతకరుహులని, గరిహితకరణుని, గరుహాసఖరుచిని, గరుడఖగరథుని. 180

గర్భద్వితీయానుష్టుప్పాత్రావృత్తము.

ఖరఘనకరవిని, ఖరతరకరగుని, గరళముఖరిపుని, గరధరకరతుని. 181

షోడశాక్షరైకపాదంబైనగర్భము మధురగతిరగడ.

కరధృతకరుహులని, గరిహితకరణుని, గరుహాసఖరుచిని, గరుడఖగరథుని
ఖరఘనకరవిని, ఖరతరకరగుని, గరళముఖరిపుని, గరధరకరతుని. 182

వ. కొందఱు దీనిని షోడశలఘువృత్తము నందురు.

### పంచదశాక్షరైకపాదంబైనగర్భద్విపదము.

కరధృతకరుహాలని, గరిహితకరణుఁ, గరువాసఖరుచిని, గరుడఖగరఘుఁ
ఖరఘునకరవిని, ఖరతరకరగుఁ, గరళీముఖరిపుని, గరధరకరతుఁ. 183

### ద్వాత్రింశదక్షరైకపాదంబైనగర్భహరిణీగతిరగడ.

కరధృతకరహాలని ♦ గరిహితకరణుని, గరువాసఖరుచిని ♦ గరుడఖగరఘుఁ
ఖరఘునకరవిఁ ♦ ఖరతరకరగుఁ ♦ గరళీమూఖరిపుని ♦ గరధరకరతుఁ. 184

### గర్భప్రథమకందము.

కరధృతకరుహాుఁ గరిహిత, కరణుఁ గరువాసఖరుచిని♦గరుడఖగరఘుఁ
ఖరఘునకరవిఁ ఖరతర, కరతుఁ గరళీముఖరిపుని♦గరధరకరతుఁ. 185

### గర్భద్వితీయకందము.

గరధరకరతుఁ గరధృత, కరుహాలుఁ గరిహితకరణుని ♦ గరువాసఖరుచిఁ
గరుడఖగరఘుని ఖరఘున, కరవిఁ ఖరతరకరగుని ♦ గరళీముఖరిపుఁ. 186

### గర్భతృతీయకందము.

గరళీముఖరిపున్ గరధర, కరతుఁ గరధృతకరుహాలని ♦ గరిహితకరణున్
గరువాసఖరుచిఁ గరుడఖ, గరఘుఁ ఖరఘునకరవిని ♦ ఖరతరకరగుఁ. 187

### గర్భచతుర్థకందము.

ఖరతరకరగుఁ గరళీము, ఖరిపున్ గరధరకరతునిఁ ♦ గరధృతకరుహాలున్
గరిహితకరణున్ గరువాస,ఖరుచిన గరుడఖగరఘుని ♦ ఖరఘునకరవిఁ. 188

### గర్భపంచమకందము.

ఖరఘునకరిహితఖరతర, కరగున్ గరళీముఖరిపునిఁ ♦ గరధరకరతున్
గరధృతకరుహాలున్ గరిహిత, కరణున్ గరువాసఖరుచిని ♦ గరుడఖగరఘుఁ. 189

### గర్భషష్ఠకందము.

గరుడఖగరఘుఁ ఖరఘున, కరవిఁ ఖరతరకరగుని ♦ గరళీముఖరిపుఁ
గరధరకరతున్ గరధృత, కరుహాలున్ గరిహితకరణుని ♦ గరువాసఖరుచిఁ. 190

### గర్భసప్తమకందము.

కరువాసఖరుచిఁ గరుడఖ, గరఘుఁ ఖరఘునకరవిని ♦ ఖరతరకరగుఁ
గరళీముఖరిపున్ గరధర,కరతున్ గరధృతకరహాలునిఁ ♦ గరిహితకరణుఁ. 191

### గర్భాష్టమకందము.

కరిహితకరణున్ గరువాస, ఖరుచిఁ గరుడఖగరఘుని ♦ ఖరఘునకరవిఁ
ఖరతరకరగుఁ గరళీము, ఖరిపున్ గరధరకరతుని ♦ గరధృతకరుహాలుఁ. 192

### పదప్రకాశికకందము.

క. కామెపలినామపురిగు, త్రామ సరోజాప్తకోటిధామ జలధర
శ్యామ యదుసోమ దనుజవి, రామ న్సాత్రాజిత్రీమనోభిరామఁ దలంతున్. 198

### ఆశ్వాసాంతగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భరద్వాజగోత్ర కామెపల్లి పురమందిర నందనందన చరణారవిందవందనాభిలాషమనీషాప్రాభవ వేంకటార్యతనూభవ విద్యావిశేషగురాచార్య కాకునూర్యప్పకవివర్యవిరచితం బైనయాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రంబునం దష్టాదశార్యావృత్తంబులు సప్తచత్వారింశత్సూత్రంబులుం గలసంధిపరిచ్ఛేద మను పంచమాశ్వాసము.

అప్పకవీయము సంపూర్ణము.

---

చెన్నపురి : వావిళ్ల ప్రెస్సున ముద్రితము.—1922.

# శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | సాధువు. | అసాధువు. |
| --- | --- | --- | --- |
| 3 | 5 | దిద్దను | డిద్దను |
| 40 | 26 | 1 చెలిమి... చెల్ల | 1 చెల్లకు...మిచెల్ల |
| 42 | 11 | 2 అది | అది |
| 51 | 1 | తులా | తలా |
| 55 | 1 | లంతస్థలు | లంతస్థులు |
| 56 | 28 | విశ్రుత | విశ్రుతి |
| 66 | 22 | టవర్గాక్షర | టవరాక్షర |
| 72 | 16 | శస్సాన్యత్ | శస్సన్యత్ |
| 86 | 5 | డేలు | డేటు |
| 96 | 10 | చెలఁగు | చెలుంగుఁ |
| 106 | 19 | షష్ఠాష్ట | షష్టాష్ఠ |
| 112 | 2 | ననియొఁ | నవియొఁ |
| 120 | 17 | వైశ్య | వైశ్న |
| 122 | 17 | మంత్ర | మత్ర |
| 146 | 11 | ద్గాంగ | దాంగ |
| 152 | 27 | [3]స్నిన్నదర్శిజ | [1]స్నిన్నదర్శిజ |
| 172 | 24 | వాంఛితార్థ | వాంచితార్థ |
| 179 | 7 | నిల్చు | నిచ్చు |
| 180 | 5 | దేహా...మునివిను | దేహా...మునిను |
| 190 | 29 | గూర్చ | గూర్చి |
| 191 | 27 | 4 విశీర్య | [4]విశీర్య |
| 219 | 4 | విచికిలిత | విచికలిత |
| 220 | 11 | ∪∪∪మ∪గ. | ∪∪∪∪మగ. |
| 221 | 17 | I∪Iజ∪∪గగమ. | I∪I∪∪గగమ. |
| 223 | 14 | III.నIII న∪గ. | IIIనIII∪గ. |

# శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | సాధువు. | అసాధువు. |
|---|---|---|---|
| 225 | 7 | ౬-౧౨౫ | ౫-౧౨౫ |
| 226 | 21 | ౧౦-౨౧౬ | ౧౦-౨౪౧ |
| 243 | 17 | ౧౬-౧౫౭౦౪౦ | ౧౬-౮౯౩౧౪ |
| ,, | 23 | ౧౬-౩౯౮౧౪ | ౧౬-౧౫౭౯౫౩ |
| 247 | 8 | [1]చినవాఁడు | [8]చినవాఁడు |
| 257 | 14 | దారిం | దారిఁ |
| 264 | 13 | జలజాప్తు | [illegible]లజాప్తు |
| 268 | 2 | సెన్నిదివిభ | సెన్నివిభ |
| 280 | 18 | దేవ | దేన |
| 304 | 13 | సాగనేని | సాగకేని |
| 305 | 1 | తరువన | తరువనఁ |
| 308 | 21 | గవసినను | గనసినను |
| ,, | 30 | తెల్లమిగాఁ | తెల్లసుగాఁ |
| 316 | 6 | రప్పలు | రప్ప |
| 317 | 11 | జలరాశి | జలరాశ |
| 323 | 26 | సంహారు | సంవాఁరు |
| 326 | 1 | జక్కు | జగ్గు |



# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము. కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి | ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటి కృతము | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము | ... | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలి సొంపు, పీఠిక అతివిపులము | ... | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దఅక్షరములతో ముద్రించినారము | | 0 | 10 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్య ప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | (అచ్చగుచున్నది) | | |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నాము | ... | 2 | 8 |
| వసుచరిత్రవిమర్శనము. శ్రీ చినసీతారామస్వామిశాస్త్రికృతము. అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు | ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము | ... | 3 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము | ... | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | ... | 2 | 8 |

# ఆంధ్ర గ్రంథములు.



| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | ... | 1 | 8 |
| హరవిలాసము | ... | 0 | 12 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము | ... | 0 | 8 |
| నరసభూపాలీయము | ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవిది | ... | 0 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్ర కవికృతము | ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| శివలీలావిలాసము, ,, | ... | 0 | 6 |
| పారిజాతాపహరణము, సాధారణప్రతి | ... | 0 | 4 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము | ... | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది, చక్కనికూర్పు | ... | 1 | 6 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 1 | 4 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక. అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలివిపులము. ఇంతకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది | ... | 3 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 1 | 6 |
| నృసింహపురాణము: ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| వైశ్యపురాణము | ... | 1 | 4 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 1 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 14 |

ఇవి మొదలగు సంస్కృతాంధ్రగ్రంథములు అనేకములు మాయొద్ద దొరకును.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.